అట్టలోపలివైపున అచ్చు వేసిన శిల్పంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్య చేస్తూ ఉండిన దృశ్యం వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు భారతదేశంలో లేఖనకళ చిత్రశిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది.

నాగార్జునకొండ క్రీ.శ. 2వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీవారి సౌజన్యంతో)

భారతీయ సాహిత్య నిర్మాతలు

# సూర్యకాంత్ త్రిపాఠీ 'నిరాలా'

పరమానంద్ శ్రీవాస్తవ్

అనువాదం :

మాచిరెడ్డి



సాహిత్య అకాదెమీ

*Suryakant Tripathi 'Nirala'* : Telugu translation by Machi Reddy of Paramanand Srivastava's monograph in Hindi, Sahitya Akademi, 2001, Rs. 25/-



First Published : 2001

ISBN : 81-260-0805-9

**సాహిత్య అకాడెమీ**

రవీంద్ర భవన్, 35, ఫెరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ - 110 001

విక్రయ విభాగము :
'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001

జీవన్‌తార భవనము, 4వ అంతస్తు, 23A/44X
డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా - 700 053

172, ముంబయి మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్,
దాదర్, ముంబాయి - 400 014

సి.ఐ.టి. క్యాంపస్, టి.టి.టి.ఐ. పోస్టు
తరమణి, చెన్నై - 600 113.

సెంట్రల్ కాలేజీ క్యాంపస్,
డా. బి.ఆర్. అంబేడ్కర్ వీధి, బెంగళూరు - 560 001

వెల రూ. 25

Laser Typesetting by Team Work, Bangalore
Printed at Liberty Enterprises, Bangalore

# విషయ సూచిక

# 1. 'స్వేచ్ఛ'కి మరో అర్థం 'నిర్భీకత'

నిరాలా (1899-1961) రచనాకాలం 20వ శతాబ్దపు మొదటి నలభై-నలభై ఐదేళ్ళ వరకు వ్యాపించి ఉంది. ఆయన 1920 ప్రాంతంలో రచనలు చెయ్యడం ఆరంభించాడు. 1961 వరకు రచించడం కొనసాగించాడు. ఈ మధ్యకాలంలో ఏమేమి జరిగిందో ఆ చరిత్రను నెమరు వేసుకోవడం ప్రత్యేకించి ఒక విశిష్ట అనుభవం. ఈ కాలంలో ఎక్కువ భాగం జాతీయ స్వాతంత్ర్య పోరాటం జోరుగా సాగింది ఈ పోరాటమే నిరాలా మనసును ప్రధానంగా తీర్చిదిద్దింది. ఆయన రూపొందించిన ప్రధాన కావ్య పద్ధతినే హిందీలో 'ఛాయావాద్' అని అంటారు. జాతీయ స్వాతంత్ర్య పోరాటంతో 'ఛాయావాద్'ను కలిపి చూస్తేనే ఆ యుగపు ప్రధాన సంవేదన అవుతుందని గుర్తించగలం. ఈ కారణంగానే తన మొదటి, పేర్కొనదగిన కవితా సంపుటి 'పరిమళ్' భూమికలో నిరాలా ఇలా రాస్తాడు - "మనుష్యులకు ముక్తి ఉన్నట్లే కవితకు కూడా ముక్తి ఉంటుంది విముక్త కవిత సాహిత్యానికి ఏ మాత్రమూ అనర్థం కల్గించకపోగా, అది సాహిత్యానికి మూలమైన ఒక విధమైన స్వాతంత్ర్య చేతనను వ్యాపింపజేస్తుంది."

నిరాలా తన మొదటి కవిత 'జన్మభూమికి వందనం' అన్నే శీర్షికతో బెంగాల్ కవి ద్విజేంద్రలాల్‌రాయ్ చూపించిన మార్గంలో రాశాడు. ఇది 'ప్రభ' అనే పత్రికలో (జూన్ 1920) అచ్చయింది. నిరాలా అగ్రజతుల్యుడు, ప్రముఖ సమకాలికుడు జయశంకర్ ప్రసాద్ సాహితీ సంవేదనను రూపొందించడంలో కూడా ఈ స్వాతంత్ర్య చేతన దోహదం చేసింది. ప్రసాద్ నాటకాలు, నృత్య నాటకాలు "అత్యున్నత హిమాద్రి శిఖరంనుంచి ప్రబుద్ధ పవిత్ర

స్వయంప్రభా సమన్వితమై సముజ్వల స్వాతంత్ర్యం పిలుస్తోంది, పిలుస్తోంది.'' దీనికి ఉదాహరణలు. ఛాయావాదపు గతిశీల అంశాలన్నీ ఈ స్వాతంత్ర్య చేతనతో పెనవేసుకొని ఉన్నాయి ప్రసాద్ నవల 'సీతాకోకచిలుక'లో స్పష్టంగా స్వాతంత్ర్యోద్యమ చైతన్య ప్రేరిత నవజాగృతి కన్పిస్తుంది ఈ నవలలో కర్షకులు తమ హక్కులకోసం పోరాడతారు భారత ప్రజలు విదేశ పెత్తందారుల దోపిడిని గుర్తిస్తారు, గర్జిస్తారు. ఛాయావాద యుగపు ఈ నవజాగృతిని గుర్తించే సందర్భంలో ఆధునిక యుగసంస్థాపకుడు అయిన భారతేందును గుర్తుకు తెచ్చుకోవడం సమంజసం. భారతేందు యుగంలో ఒక పక్క దోపిడినీ, అన్యాయాన్నీ వ్యతిరేకిస్తూ జరిగిన పోరాట చైతన్యం కన్పించేది అదేవిధంగా, ఛాయావాదంలో కూడా ఒక ప్రక్క సామాజిక నవజాగృతి చేతన ఉండగా, మరోప్రక్క వాస్తవాన్ని సూక్ష్మ కాల్పనిక వ్యక్తిగత అనుభూతిలో ఇముడ్చుకునే అనురాగాత్మక ఆకాంక్ష కూడా దృగ్గోచరమౌతుంది. నిరాలా రచనాత్మక మానసం కూడా ఈ అంతర్వైరుధ్యాలతో తలపడతూ, వాస్తవ చేతనతో ముందుకు సాగింది.

స్వాతంత్ర్య పోరాట చరిత్రను కాస్త ముందునుంచి చూడాల్సిన అవసరం ఉంది ఎందుకంటే మనం సామాజిక చైతన్యాన్నీ సామాజిక, సాంస్కృతిక జాగృతి-చేతననూ సమాంతరంగా పరిశీలించగలగాలి 10-20 ఏళ్ళలో వచ్చే తాత్కాలిక గందరగోళ పరిస్థితులతో సాహితీ హృదయం నిర్మితంగాదు. దీర్ఘకాలంపాటు ఈ సంప్రదాయం కొనసాగితే దానితో గతి తార్కిక సంబంధం నెరపుతూ వికసిస్తుంది సాహిత్యం ఛాయావాద యుగ నవజాగృతిపై కూడా ముందునుంచి వస్తున్న సుదీర్ఘ పోరాట క్రమ ప్రభావం స్పష్టం 1857 నాటి జాతీయ తిరుగుబాటు ఫలితంగా బ్రిటీషు పాలకులకూ, భారతప్రజలకూ మధ్య వైరుధ్యం బాగా పెరిగింది. ఈ తిరుగుబాటులో రైతాంగ జనుల పాత్ర ప్రధానమైనది. 19వ శతాబ్దపు 7వ దశకంలో స్వదేశీ ఉద్యమం పెల్లుబికింది. హిందీ మాట్లాడే ప్రాంతంలో జరిగిన ఈ ఉద్యమ సంకల్పాన్ని భారతేందు 1874లో 'కవివచన సుధ' అనే పత్రికలో మార్చ్ 23న ఈ విధంగా వ్యక్తం చేశాడు - ''మనం ఈ రోజు నుంచి విదేశీ వస్త్రాలనే ధరించం''. భారతేందు, అతని సహచరులు జానపద బాణీలతో గేయాలు రాసి ఈ ఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకెళ్ళే ప్రయత్నం చేశారు. పెట్టుబడివారి విధానం ఎలా సామ్రాజ్యవాద రూపం ధరిస్తుందో, ఎలా జనవిముక్తికి విఘాతం కల్గిస్తుందో-ఈ విషయాల చైతన్యం బాలముకుంద్‌గుప్తలాంటి రచయితల్లో కన్పిస్తుంది. స్వాతంత్ర్య చైతన్యాన్ని సాంస్కృతిక నైతిక విప్లవంగా మార్చాలనే దృష్టి రామకృష్ణ పరమహంస (1834-1886), స్వామి దయానంద సరస్వతి (1824-1883)లలో కన్పిస్తుంది. 1885లో భారత జాతీయ కాంగ్రెస్ స్థాపించబడింది. దీనితో, పరివర్తనకు

ఉపకరించే అనేక ప్రయత్నాలు ఒక స్పష్టమైన లక్ష్యంతో జోడించబడ్డాయి. తిలక్, లాలాలజ్‌పత్‌రాయ్‌లు కాంగ్రెసు సంస్థకు గొప్ప నాయకత్వం ఇవ్వగలిగారు. 1889లో థియోసాఫికల్ సొసైటి స్థాపించబడింది ఇది ఉదార మానవతావాద భావనవైపు దృష్టిని మరల్చే ప్రయత్నం చేసింది. ఇటువంటి సంస్థల్లో అనేక అంతర్ వైరుధ్యాలు ఉండేవి

హిందీ నవజాగృతికి మొదటి మెట్టు భారతేందు యుగమైతే, రెండవ ప్రముఖ దశ మహావీర్ ప్రసాద్ ద్వివేదీ, వీరి సహచరుల రచనా కాలం (1900-1920). 1900లో 'సరస్వతి' ప్రచురణ ఆరంభమయింది; 1920లో ద్వివేదీ 'సరస్వతి' పత్రిక నుంచి వైదొలగారు. 'ఛాయావాదం' పేరుతో వచ్చిన సూక్ష్మ, లాక్షణిక కావ్యధోరణి ద్వివేదీ యుగపు స్థూల ఇతివృత్తాత్మక కవిత్వానికి విరుగుడుగా ఉద్భవించిందనే భావన ఒకటి ఉంది. ఇందులో పాక్షిక సత్యం ఉండొచ్చు. వాస్తవమేమిటంటే ఛాయావాదం ఒకటికాదు; అనేక ఛాయావాద రూపాలున్నాయి. ద్వివేదీ యుగపు దేశీయ కాల్పనికతావాదాన్ని, సాంస్కృతిక నవజాగృతిని, నవ్య వాస్తవికతా వాదాన్ని సమర్థించే ఛాయావాదంతో కలిపి చూడొచ్చు. రెండవది కావ్యాత్మక నైరూప్యతా - ప్రధాన సూక్ష్మ ఛాయావాదం. ఈ ఛాయావాదం ఎక్కువగా అంతర్ముఖంగాను, కాల్పనికంగాను ఊహాత్మకంగాను అన్పిస్తుంది. ఈ ధోరణినే రామ్‌చంద్ర శుక్ల (1884-1941) జాతీయ కవితా ప్రవాహానికి ఒక విధమైన 'విచలనం' అని అన్నారు. నిరాలా కావ్య వికాసం మొదటి రకపు ఛాయావాదానికి నిదర్శనమన్పిస్తుంది. నిరాలా కథల్లోని వచనం వాస్తవికతావాద గద్యం. కవి దృష్టి కూడా దాదాపు వాస్తవోన్ముఖం అన్పిస్తుంది. నిరాలా ఛాయావాదానికి సంస్కారమిస్తాడు; ద్వివేదీ యుగపు స్థూల నైతికతా వాదాన్ని అధిగమిస్తాడు. కాని, 'రీతి' వాదానికి వ్యతిరేకంగా జరిగిన ఉద్యమంలో ద్వివేదీకి దగ్గరగా ఉంటాడు. ఆంగ్లేయుల పాలన, జమీందారీ విధానం, రైతు ఉద్యమాలు లాంటి విషయాల్పై రాస్తున్నపుడు మహావీర్‌ప్రసాద్ ద్వివేదిలాగా నిరాలా కూడా అదే నవజాగృతికి పోషకుడన్పిస్తుంది వంగ విభజన వ్యతిరేకోద్యమం, చంపారణ్ సత్యాగ్రహం, అక్టోబర్ విప్లవం (1917) లాంటి ఘటనల పట్ల జాతీయ చైతన్యంతో రచయితలు స్పందించడం గమనించవచ్చు కొంతకాలం తర్వాత 1926లో నిరాలా 'జాగోఫిర్ ఏక్ బార్' లాంటి కవిత 'మత్‌వాలా' అనే పత్రికలో ప్రచురించాడు. జాగృతికి ఇచ్చిన ఈ పిలుపు ఆకస్మికం కాదు. ఇది వాస్తవాన్ని విస్మరించే ఆధ్యాత్మిక ఆవేశమూ కాదు

ఛాయావాద చరిత్ర రెండు ప్రపంచ యుద్ధాల (1914-18; 1939-45) మధ్య విస్తరించి ఉంది. ఇది మన స్వాతంత్ర్య పోరాటంలో అత్యంత ప్రధాన ఘట్టం. ఒకపక్క సామూహిక సహాయ నిరాకరణోద్యమం కోసం డిమాండ్ ఎక్కువయింది; మరోవైపు సత్యాగ్రహంలాంటి అహింసా పద్ధతుల వైఫల్యం చూసి కొన్ని వర్గాల్లో ఉద్రేకం పెరగ

సాగింది. చౌరీచౌరా ఘటనలో పెచ్చరిల్లిన హింసను చూసి గాంధీజీ తన ఉద్యమాన్ని ఉపసంహరించి, తనకు ఆరేళ్ళ జైలుశిక్షపడితే, జైలుకెళ్ళారు. దేశంలో మత కలహాలు ప్రజ్వరిల్లాయి. అప్పుడు గాంధీజీ హిందూ-ముస్లిం సమైక్యతకై గొప్ప కృషిచేశారు. ఆయన ఈ ప్రయత్నంలో జీవితాంతం నిమగ్నులైనారు. ఉగ్రరూపం ధరించిన విప్లవోద్యమ పరిణామాలు స్పష్టమే. అణచివేత అధికం కాజొచ్చింది. కాంగ్రెస్‌లో కూడా అతివాదులు బలం పుంజుకున్నారు. ఈ అతివాదులకు జవాహర్‌లాల్ నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్ నాయకత్వం వహించారు. ఉప్పు సత్యాగ్రహంలో సామాన్య ప్రజలు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. 1930లో నిరాలా స్వాతంత్ర్యానికి మార్గం పోరాటమేనని చెబుతూ వచ్చారు. 1930లోనే నిరాలా ఇంగ్లండు, భారత దేశాల మధ్య సంబంధాల గురించి ఇలా రాశాడు-

''ఇంగ్లండు చేతిలో భారతదేశమనే బంగరుపక్షి చిక్కుకుంది. అక్కడి పెట్టుబడిదారులు భారతదేశానికి అవసరానికి మించి అధికారాలు ఇవ్వడానికి బొత్తిగా ఇష్టపడటం లేదు. ఇక్కడే వృత్తుల పరాధీనత మరింత కర్కశంగా, కొల్లగొట్టే విధంగా నిలువు దోపిడిగా మారింది. ఇందువల్లే రైతుల దుస్థితి దుర్భరం అయింది. పట్టు, జనుము, పత్తి, ధాన్యం లాంటి ముడిపదార్థాలు ఇక్కడ ఉత్పత్తి అవుతాయి. కాని, అవి తెల్లవారు నిర్ణయించే ధరలతోనే అమ్ముడుపోతాయి. రైతులు ఈ సరుకుల్ని నిలవ చేయడానికి తగిన సదుపాయాలు సమకూర్చుకోలేరు. వాళ్ళ దృఢ విశ్వాసం సమూలంగా నాశనం చేయుబడింది ''

1932లో నిరాలా రవీంద్రనాథ్ టాగూరును సమర్థిస్తూ, ఇతర పీడిత దేశాలకు సోషలిస్టు రష్యా ఒక ఆదర్శం అని రాశాడు. ('సుధ', సెప్టెంబర్ '32). దాదాపు ఇదే సమయంలో, ప్రపంచంలోనే కబీర్‌లాంటి ఉన్నత భావాలుగల రచయితలు అరుదు అని వ్యాఖ్యానించాడు నిరాలా. ''మనం ఐరోపానుంచి కొంత నేర్చుకోవాలి; కొంత మనం వారికి నేర్పాలి.'' అని 1933లో 'సుధ'లో అచ్చయిన వ్యాసంలో నిరాలా రాశాడు 1934లో కాంగ్రెసు ''సోషలిష్టు-గ్రూప్'' ఏర్పడింది. 1936లో కాంగ్రెస్ 49వ మహాసభకు (లక్నో) జవాహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షత వహించారు. 1937లో అభ్యుదయ రచయితల సంఘం మొదటి సమావేశం లక్నోలో జరిగింది. ప్రేమ్‌చంద్ దీనికి అధ్యక్షత వహించారు 1937-39లో జరిగిన ప్రజా ఉద్యమాలలో ప్రధానమైనది, ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిర్మాణబద్ధంగా కార్యక్రమాలు నడిపిన దేశీయ సంస్థానాల ప్రజాందోళన గఢకొలాలో (నిరాలా స్వంత గ్రామం) రైతాంగ ఉద్యమానికి నిర్మాణబద్ధం చేసే ప్రక్రియలో స్వయంగా నిరాలా పాల్గొన్నాడు. 1940లో దేశంలో కార్మికోద్యమాలు తీవ్రమయినాయి. 1942లో స్వాతంత్ర్యోద్యమం తీవ్రస్థాయిని సంతరించుకొంది. నిరాలా ''గహన్‌హై యే అంధకారా '

అనే కవిత రాశాడు. ఈ కవితను చాలా విధాలుగా వ్యాఖ్యానించవచ్చు. కాని స్వాతంత్ర్యోద్యమ సన్నివేశం, మానసిక వత్తిడి రూపంలో ప్రతిబింబించింది. 1943లో రాసిన కవిత 'దేవీ సరస్వతి'లో రైతాంగ సంవేదనా స్పర్శను చూడకుండా ఉండలేము. రైతాంగ పోరాటంలో నిరాలా రైతుల పక్షమే అని చెప్పడానికిది నిదర్శనం :

వ్యవసాయం చూపిన మాయలో
దుఃఖితులైన రైతువనితల కళ్ళు
ఆనందబాష్పాలతో మెరిశాయి
సస్య సంపదనిండిన పొలాలు
ధాన్యలక్ష్మితో తులతూగాయి
పండుగ పబ్బాలతో విరిశాయి
తన్మయ రైతాంగ ఇళ్ళు వాకిళ్ళు

1946లో సైనికుల అశాంతి ఒక పెద్ద సంఘటన. దీని పరిణామమే నౌకాదళ తిరుగుబాటు. '46లోనే నిరాలా ఒక కవితలో ఇలా రాశాడు - 'మనం ఆడిన రక్తసిక్త హోలీ'' - స్వాతంత్ర్యం వచ్చింది - దేశ విభజనతో పాటు. 1948లో గాంధీజీ హత్య జరిగింది. '46లో నిలాలా రాశాడు -''గొప్పవాళ్లు, ధనమూ, అభిమానమూ, వదులుకుంటేనే దేశం నిజంగా విముక్తమౌతుంది.'' స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, బహుశా అలా జరగలేదని నిరాలాకు అన్పించింది. నిరాలా నిర్వేదంలో చెదిరిన కల అసంతృప్తి, అశాంతి, నిరాశా, నిస్పృహలు కూడా ఉన్నాయి. ఈ కాల వ్యవధిలో మార్పులు వేగంగా వచ్చాయి. సామాజిక జాగృతికి సంబంధించిన చారిత్రక దృక్పథంతో చూస్తే ఇది స్పష్టమౌతుంది. విద్య, సాంస్కృతిక రంగాల్లో ముఖ్యమైన మార్పులు స్పష్టం కాసాగినాయి. స్త్రీ విద్య వా ్యపించింది. సత్యాగ్రహం లాంటి ఉద్యమాల్లో స్త్రీలు ముందుకొచ్చేవారు. స్త్రీ పురుషుల సంబంధాల్లో మార్పు వచ్చింది. సౌందర్యపు గీటురాళ్ళు మారినాయి. పంత్‌లాంటి కవులు 'దేవీ, మాత, సహోదరి, ప్రాణం' అని స్త్రీని సంబోధిస్తూ, స్త్రీపురుష సంబంధాలలో వచ్చిన కొత్త మలుపువైపు జనాల్ని ఆకర్షించారు. ప్రేమ్‌చంద్ నవలల్లోనే కాదు, హక్కులు, అధికారాల కోసం పోరాడే స్త్రీలను భారతీయ సామాజిక జీవితంలో కూడా ప్రత్యక్షంగా చూడొచ్చు. 'గోదాన్'లో ధనియా దోపిడిని, దమనకాండనూ ఒకవైపు గత్యంతరంలేక సహిస్తూనే, మరోవైపు దాన్ని వ్యతిరేకిస్తూ పరుషంగా కూడా మాట్లాడుతుంది 'సమాజం-స్త్రీలు' అనే శీర్షికతో 1929లోనే నిరాలా ఇలా వ్యాఖ్యానించాడు -

''గొప్ప విప్లవాలే ప్రతిసంస్కరణకూ మూలం'' ఆ విప్లవాలకు అనుగుణంగా సమాజంలో మార్పులు వచ్చినప్పుడు స్త్రీలు కూడా మారుతూ వచ్చారు. పోలేసు జులుంను భారతేందు వ్యతిరేకిస్తాడు. ప్రేమ్‌చంద్, నిరాలా సమకాలీన సాంఘిక వ్యవస్థను చెల్చిచెండాడారు. రవీంద్రుని సాంస్కృతిక చైతన్య పిలుపును నిరాలా గుర్తిస్తాడు. కాని నిరాలాలోని తిరుగుబాటు చైతన్యం రవీంద్రుని చేతన కంటే అగ్రగామి. 'వర్ణాశ్రమ వ్యవస్థ వర్తమాన స్థితి' అనే దానిపై వ్యాఖ్యానిస్తూ వివేకానందుని చేత ప్రభావితుడై పరాధీన దేశపు పౌరులంతా శూద్రులేనని, దీనిలో బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు వుండరని భావిస్తాడు. నిరాలా 'వైశ్యులు' అనే పదానికి 'పెట్టుబడిదారులు' అనీ 'శూద్రులు' అంటే కర్షకులనీ వ్యాఖ్యానిస్తాడు. ఈ వ్యాఖ్య వెనుక నిశ్చితమైన ఒక దృక్పథం వుంది. విప్లవాత్మక పరివర్తన కోరే దృష్టి అది.

స్వాతంత్ర్య పోరాటానికీ ఛాయావాదానికీ మధ్య గల సంబంధాన్ని విశ్లేషిస్తూ నిరాలా 'రాజనీతి-సమాజం' (సుధ, ఆగస్టు, 1933) లో ఇలా వ్యాఖ్యానించాడు - రాజకీయానికి సమాజానికి అవినాభావ సంబంధం ఉంది. సామాజిక సంసిద్ధతను రాజకీయ సంసిద్ధత అనడం అతిశయోక్తి కాదు'' ఈ పోరాటంలో నిరాలా, ఇతర సమకాలీన రచయితలూ ఒక ప్రగతిశీల సమాజాన్ని నిర్మించే ప్రక్రియ పట్ల అత్యంత జాగరూకులై వుండేవారు. రత్నాకర్, మిశ్రబంధు, పద్మసింహశర్మలు ప్రాతినిధ్యం వహించే రీతివాదంతో, ఛాయావాదం తొలినాళ్ళలో తలపడాల్సి వచ్చింది. 'రీతి' వాదులు శుద్ధ రసభావనను పోషించారు. నవజాగృతి ప్రేరితమైన ఛాయావాదంతో ఇది పొసగదు. ఛాయావాదపు అనేక ప్రత్యేకతలకు మూలం వ్యక్తివాదం. కాని, వాటి ప్రభావం సామాజిక సంబంధాల పూర్తి చట్రంపైనే పడింది. ఈ వ్యక్తివాదం రీతివాదపు సామూహిక అభిరుచికి విరుద్ధమైనది. నవజాగృతి పక్షం వహిస్తుంది. 'కామాయని'లోని 'మను' వ్యక్తివాదియే, కాని శ్రద్ధ, అనే పాత్ర ద్వారా ప్రసాద్ ఇచ్చే ముఖ్య సందేశం ప్రజాస్వామ్యం. కళ కళ కోసం అనే అలంకార వాద భావన పెట్టుబడిదారీవాదాన్ని స్వీకరించడమే అవుతుంది. కళ పట్ల వినియోగవాద పరాకాష్ఠ రీతివాద కావ్యాభిరుచిలో కన్పిస్తుంది. కళను గురించిన సొంత గీటురాయి రూపొందించుకున్నప్పటికీ, ఛాయావాదం కళావాది కాదు. అది కళాత్మకతకంటే, అనుభూతికి ఎక్కువ ప్రాధాన్యం ఇస్తుంది. అయితే ఛాయావాద కవులు సామాజిక చైతన్యంతో రాయడం వల్ల వారి అనుభూతి సీమితం కాదు అనేది స్పష్టం. ఛాయావాద కవులు 'ఖడీబోలీ'ని కావ్యభాషగా చేసేందుకు పోరాటం చేశారు. అలా చేస్తున్నప్పుడు ''వ్రజభాష'' వ్యతిరేకత వారి ఉద్దేశం కాదు. నాయికా భేదాలు లెక్కపెట్టే సామంతవాద అభిరుచికి వ్రజ భాషాశక్తిని అంకితం చేయుడానికి వారు వ్యతిరేకం. ఛాయావాద కవుల

ప్రకృతిచిత్రణ రీతివాదుల ప్రకృతిచిత్రణలో పోల్చిచూస్తే, సూక్ష్మసంవేదనా ప్రధానమై వుండటమే కాదు, అందులో జీవితం తొణికిసలాడుతూవుంటుంది. ప్రకృతిలో స్వేచ్ఛా సంచారాన్ని నిరాలా ఒక జాతి విముక్తి సన్నివేశంలో చూస్తాడు. ఛాయావాదయుగపు భావాత్మక తిరుగుబాటు సామాజిక సందర్భంలేనిది కాదు, ఛాయావాద కవుల భావ జాలాన్ని జనవిముక్తి ఆకాంక్షలతో జతచేసి చూస్తే మనకు ఈ అభిప్రాయం కలుగుతుంది. నిరాలాకు ఛాయావాద శక్తీ, పరిమితీ రెండూ తెలుసు. తన వ్యాసాల్లో సాహితీధర్మం పైరాస్తూ దాని గుణాత్మక పక్షాన్ని వెల్లడించడంలో ముందున్నాడు నిరాలా. 'ప్రబంధపద్మ' అనే వ్యాస సంపుటిలోని ఒక వ్యాసంలో ఛాయావాద సంక్లిష్టతను నిరాలా ఇలా స్పష్టీకరిస్తాడు. -

''భాష, సాహిత్యం దృష్టితో చూస్తే ఛాయావాద కవిత అధిక వికసిత రూపం మంచి మంచి కవితలు దీనికి ఉదాహరణలు. ఎక్కడైతే అస్పష్టత వుందో, భావాల వ్యక్తీకరణ సరిగా లేదో, భావ చిత్రాలు ప్రకాశవంతంగా లేవో, అక్కడ బలహీనత వుంది, దీన్ని అధిగమించేందుకు రచయితలు కృషి చేయాలి. 'ఖఢీబోలీ'లో రాసిన ఆధునిక కవితలు ప్రాచీన కాలపు కవితల పోటికి నిలువలేవని కొందరు వాదిస్తున్నారు ఇది అతిశయోక్తి అని నేనకుంటున్నాను ఇది నా అల్పజ్ఞత కాదు, వారి అల్పజ్ఞత సాహిత్యం పట్ల వారు అన్యాయం చేస్తున్నారు''. మహావీర్ ప్రసాద్ ద్వివేదీలాంటి ఆచార్యులు 'క్లిష్టత' అన్న దాన్ని నిరాలా 'సాహిత్యాత్మ అని పేర్కొన్నాడు

నిరాలాయుగం సంఘటనల యుగం, ఉద్రేకాల యుగం. నిరాలా సామాజిక సాంస్కృతిక నవజాగృతి పక్షాన నిరంతరం పోరాటం చేసేవాడు. ఛాయావాదానికి ఒక విశిష్టరూపం ఇచ్చాడు నిరాలా, ఒక దశలో ఆ ధోరణి పరిమితులను అధిగమించాడు కూడాను హిందీప్రాంతపు నవజాగృతీ చరిత్ర ఎంత సంక్లిష్టమో, నిరాలా రచనావికాసం కూడా అంతే సంక్లిష్టం. పంత్ కవితా పరిణామం లోని మలుపులు ఎంత సులభంగా అర్థమవుతాయో, అంతే సులభంగా, సజావుగా మనం నిరాలా కవితల్ని అర్థం చేసుకోలేం. నిరాలా రచనా పరిణామంలో సంక్లిష్టమైన అంతర్ వైరుధ్యాలున్నాయి. అవి ఆతని రచనా పరిమితి అనలేం. అవి ఆతని యోగ్యతకు నిదర్శనం స్వాతంత్ర్య పోరాట చారిత్రిక చైతన్యాన్ని నిరాలా తనదైన శైలిలో గ్రహిస్తాడు, వ్యక్తం చేస్తాడు. ఎన్నో ఉత్తేజకర ఘటనలతో నిరాలాకు గల ప్రగాఢ సంబంధం నిరాలాను ప్రధాన వ్యక్తిగా చేసింది. నిరాలా అనేక సంఘటనలనూ, ధోరణులనూ సమీక్షిస్తాడు - ప్రగాఢ నిబద్ధతతో, మౌలిక దృక్పథంతో. దురదృష్టమేమంటే, దేశానికి స్వాతంత్ర్యం వచ్చేటప్పటికి నిరాలా విక్షిప్తుడైనాడు ఈ విక్షిప్త కాలపు సృష్టి అన్పించే రచనల్లో కూడా ఆ కాలపు ప్రతిధ్వని కన్పిస్తుంది. వీటి తర్వాత వచ్చిన ప్రార్థనాగేయాలు కూడా అక్కడక్కడా వాస్తవికత వేసిన కాటును వ్యక్తం చేస్తాయి

నిరాలా రచనాకాలం భారత చరిత్రలో అత్యంత ప్రధానమైంది. కవిత, కథానిక, నవల లాంటి అన్ని ప్రక్రియల్లోనూ నిరాలా సమకాలీన వాస్తవికతతో తలపడే స్థితి కన్పిస్తుంది. దీంతోపాటు నిరాలా, జీవితపు మౌలిక సమస్యలతో సతమమౌతూ కాలాన్ని అధిగమిస్తాడు. స్వాతంత్ర్యోద్యమ చైతన్యం ఈ దశలో మహత్తర సాంస్కృతిక పునరుజ్జీవనంలో భాగం. గతాన్ని సమకాలీన చైతన్యంతో ఎదుర్కొనే విధానం వెనుక కూడా, ఈ సాంస్కృతిక పునరుజ్జీవన ప్రేరణ ఉంది. భారతీయ సామాజిక జీవితంలో సంభవిస్తున్న ప్రధాన సంక్రమణం, పరివర్తన పట్ల జాగృతీ ఈకాలపు సాహిత్యంలో ప్రతిబింబించాయి. ఈ అవగాహన ప్రకారం సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరిగే ఉద్యమ విజయం సామంతవాదాన్ని వ్యతిరేకించకుండా వీలు కాదు. 'స్వాతంత్ర్యం' అనేది ఆనాడు ఎన్నో అర్థాల్ని ధ్వనించే పదం. నిరాలా, ''స్వేచ్ఛ-దీని మరో అర్థం నిర్భీకత'' అంటున్నప్పుడు స్వాతంత్ర్యలోని అనేక కోణాల్ని సూచిస్తున్నాడు.

# 2. విషాదమయం - జీవితం

నిరాలా (సూర్యకుమార్) మహిషాదళ్‌లో హెడ్‌కానిస్టేబుల్‌గా నియమితులైన (గఢ్‌కోలా మూల నివాసి) రామ్ సహాయ్ పండిట్ ఇంట్లో 1899 ఫిబ్రవరి 29న (విక్రమ సంవత్సరం 1955, మాఘశుక్ల 11) జన్మించాడు నిరాలా పసిమనసును స్వగ్రామమైన గఢ్‌కోలా అనుభవాలూ, మహిషాదళ్ (బెంగాలు) అనుభవాలూ అనేక రకాలుగా ప్రభావితం చేశాయి. గఢ్‌కోలాను పోరాట పటిమ వున్న రైతులకు పెట్టనికోట. ఇక్కడే నిరాలా రైతు ఉద్యమాన్ని ఒక నిర్మాణబద్ధ రూపంలో సాగించడం యాధృచ్ఛికం కాదు. బాల్యం బెంగాలులో గడిచింది. బెంగాల్ సంస్కృతితో ప్రభావితులైనాడు నిరాలా. కాని తన తీవ్ర మొండి స్వభావం వల్ల నిరాలాలో ఒక రకమైన మానసిక అశాంతి కూడా వుండేది. రెండున్నర సంవత్సరాల ప్రాయంలోనే నిరాలా అమ్మను కోల్పోయాడు. నాన్న దగ్గర మహిషాదళ్‌లో పెరిగాడు. మహిషాదళ్ రాచరిక ప్రపంచం, తన ప్రపంచం అన్పించడం లేదు. గఢ్‌కోలాలో నిరాలా జీవితం కటువైన వాస్తవికతతో తలపడాల్సి వచ్చింది.

సౌందర్యచేతన, ప్రకృతి, స్త్రీల పట్ల ఆకర్షణా నిరాలాలో క్రమంగా పెరగసాగాయి. ఆయన కవితా సృజన అంతా సౌందర్యాను భవ భావచిత్రాల మయం. నిరాలాతో పెళ్లయేప్పటికి మనోహారాదేవికి పదకొండేళ్ల వయసు. ఆమె ఎక్కువగా పుట్టింట్లో వుండేది. నిరాలా మహిషాదళ్‌లో వుండేవాడు. ఫుట్‌బాల్ ఆడుతూ, నాటకాలు చూస్తూ, బాంగ్లాబాష, రవీంద్రనాథ్ టాగూరుతో తన పరిచయం పెంచుకుంటూవుండేవాడు.

డల్‌మవూలో నిరాలాకు కుల్లీభాట్ లాంటి పాత్రలు దొరికారు. ఎంట్రెన్స్‌లో ఫెయిలయినందుకు నాన్నగారు నిరాలాను ఇంటినుంచి బయటకు పంపించివేశారు భార్యతో డల్‌మవూ వచ్చాడు నిరాలా మనోహరాదేవికి మొదట కొడుకు (రామకృష్ణ) తర్వాత కూతురు (సరోజ) పుట్టారు. సరోజ పుట్టిన సంవత్సరమే నిరాలా నాన్నగారు చనిపోయారు. నిరాలా జీవితం పూర్తిగా కొత్తరూపం దాల్చింది. అది ఇప్పుడు గట్టి సవాలును ఎదుర్కొన్నది మహిషాదళ్‌రాజు నిరాలాకు ఉద్యోగమిచ్చాడు. కోర్టు కేసులు చదివి రాసే ఉద్యోగం. భార్యకు బాగాలేదని ఒక రోజు టెలిగ్రాం అందింది. వెంటనే నిరాలా డల్‌మవూ వెళ్లాడు. అప్పటికే అయన సతీమణి చితిలో కాలి భస్మమయింది ఇది గట్టిదెబ్బ నిరాలాకు. జీవితాంతం నిరాలా దీన్ని ఎంతో దుఃఖంతో స్మరించుకునేవాడు. కొడుకునూ, కూతుర్ని డల్‌మవూలో విడిచిబెట్టి నిరాలా గఢ్‌కోలా వచ్చేశాడు అక్కడ భయంకరంగా మశూచి వ్యాపించి వుంది ఎన్నో కుటుంబాలు నాశనమైనాయి పిడకలలాంటి ఆ రోజుల్లో మనోహరాదేవి స్మృతులతో నిరాలా ఆధ్యాత్మికత వైపు మర లి వుండేవాడు. మనసులో అనురాగ విరాగాల ద్వంద్వం పనిచేస్తోంది

మహిషాదళ్‌లో నిరాలా రామకృష్ణ పరమహంస శిష్యుడు ప్రేమానంద్‌ను కలిశాడు కాని నిరాలా లోని ద్వంద్వానికిది సమాధానం కాలేకపోయింది అది ఒక ఉదాత్త అనుభవ ప్రపంచంతో సంబంధం మాత్రమే. ఇప్పుడు నిరాలాకు దేశకాల సమస్యలు సరికొత్త రూపంలో కన్పించసాగాయి స్వాతంత్ర్య పోరాటం పట్ల నిరాలా ఆసక్తి పెరిగింది గాంధీగారి సహాయ నిరాకరణోద్యమం అర్ధమేమిటో నిరాలా తెలుసుకున్నాడు. 'నిరాలా' అనేది కవి, తాను పెట్టుకున్న పేరు, తర్వాత ఈ పదం ఒక అద్వితీయ తిరుగుబాటు వ్యక్తిత్వానికి పర్యాయ పదంగా మారింది. మహావీర్‌ప్రసాద్ ద్వివేదితో ఉత్తర ప్రత్యుత్తరాలు మొదలయ్యాయి మహిషాదళ్‌నుంచి గఢ్‌కోలా రావడంతో ఉత్తర ప్రత్యుత్తరాల ఈ సంబంధం నిండుదనాన్ని సంతరించుకొంది నిరాలా కలకత్తాకో, వారణాసికో అడపాదడపా వెళ్లాలనుకొనేవాడు. బ్రతుకు తెరువు సమస్యే, కాని, ఒక చోట స్థిరంగా వుండటం నిరాలా స్వభావంలోనే లేదు. 1921లో నిరాలా రాశాడు - 'గట్టిదెబ్బలు తగిలినప్పుడు హృదయం కంపించిపోయింది ' ఈలోగా నిరాల 'సమన్వయ్' పత్రికతో సంబంధాలు పెట్టుకున్నాడు. ఇదే సమయంలో ఆయన గిరీష్‌చంద్రఘోష్‌నాటకాల ద్వారా ఛందోవిముక్తి (ఫ్రీవర్స్) సంస్కారం పొందారు. 'జాజిమొగ్గ' కవిత రానేపుడు రవీంద్రనాథ్‌టాగూరు భాషా సౌష్టవం పనిచేసింది. టాగూరు మాదిరి రాయాలనే సవాలు కూడా ఎదురయింది. ఆధునిక 'ఖడీబోలీ' అనాగరికం, అకావ్యాత్మకం అని అనుకుంటున్న రోజుల్లో వ్రజభాషలోని రీతివాద కావ్యరసికులకు ఈ రూపంలో నిరాలా సమాధానమిచ్చాడు.

కలకత్తానుంచి తన తొలి కవితా సంపుటి 'అనామిక' (1923) వెలువరించాడు నిరాలా, మహాదేవ్ ప్రసాద్ సేఠ్ దగ్గర కొచ్చాడు ఇటు ఛాయావాదపు ఆరంభకాలంలో 'ఇందు' అనే పత్రిక ద్వారా నవ్యరచనా చైతన్యం కల్గింపచేస్తున్నాడు ప్రసాద్ 'సరస్వతి'లో ఛాయావాద వ్యతిరేక వాతావరణం కొద్దిగా వ్యాపించి వుండేది. కాని పంత్ కవితలు దీంట్లో అచ్చవుతూ వుండేవి గంభీర కావ్యాలు మాత్రమే కాకుండా వ్యంగ్యం వైపు కూడా దృష్టి సారించాడు నిరాలా వాస్తవికతను చిత్రించడం నిరాలాలో మొదటినుంచే వుంది. వాస్తవికతకూ, వ్యంగ్యానికీ మధ్య వుండే సంబంధం నిరాలాకు బాగా తెలుసు ఈ అవగాహన అతన్ని ఇతర ఛాయావాద కవుల నుంచి వేరు చేసింది ఛాయావాదం, ఒక ఉద్యమ రూపంలో పరిఢవిల్లడానికి, నిరాలా దోహదం ఎంతో వుంది కాని, అయన ఛాయావాద పరిమితుల్ని అధిగమించాడు. అయన రచనాపోరాటం వెలుగులో వాస్తవికతావాదానికి విరుద్ధం కానటువంటి, పైగా దానితో గట్టి సంబంధం వున్నటువంటి ఛాయావాద దర్శనం సంభవం నిరాలా రచనలు మనకు ఛాయావాదాన్ని స్వాతంత్ర్యపోరాటంతో జోడించి చూసే దృష్టినిస్తాయి

నిరాలా తన జీవన పోరాంటలో, రచనా సంఘర్షణాక్రమంలో ముగ్గురుగొప్పకవులతో ఒక విధమైన కొత్త సంబంధం నెలకొల్పుకున్నాడు అయన పై వీరి ప్రభావం కన్పిస్తుంది వాళ్లతో పోటిపడటం కూడా వుంది తులసీదాసు, గాలిబ్, రవీంద్రనాథ్ - వీరి విశాల కావ్యలోకంతో నిరాలా నిరంతరం ఢీకొనేవాడు తర్వాత, తులసీదాస్‌ని తన కావ్యనాయకునిగా చేయడం ద్వారా నిరాలా తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని వెల్లడించుకొన్నాడు.

''విశాల దృష్టి, పరిపుష్ట దేహం, భయరాహిత్యం, నిస్సంశయత్వం, ప్రతిభతో కూడిన మందస్మితం పదేపదే గుర్తుకొచ్చే గుణాలు'' - ఈ చిత్రం తులసీదాస్ పరంగా ఎంత నిజమో, నిరాలా పరంగా కూడా అంతే నిజం. గాలిబ్‌లో నిరాలాకు వేదాంత ఛాయలు కన్పించాయి. రవీంద్రునిపై నిరాలా ఒక గ్రంథమే రాశాడు, - 'రవీంద్ర కవితా కానన్' అనే శీర్షికతో. వేదాంతభూమిలోని సాంస్కృతిక సాహచర్యం (హిందూముస్లిం ఐక్యత) సార్థకమని భావించాడు నిరాలా.

సాహితీరంగంలో నిరాలా వ్యతిరేకుల సంఖ్య తక్కువేమీ కాదు. నిరాలాపై నిరంతరం దెబ్బతీసేవాళ్ళు వీరు నిరాలా కలకత్తా నుంచి గఢకోలా వస్తూపోతూ వుండేవాడు. 1924లో అవధ్ ప్రాంతంలో భూమికి సంబంధించిన కొత్త రికార్డులు తయారవుతున్నపుడు నిరాలా తన తోటి, భూముల రికార్డుల్ని సరిచేయించు కొన్నాడు. మహావీర్ ప్రసాద్ ద్వివేది,

బాలకృష్ణ శర్మ 'నవీన్'గార్లతో నిరాలాకు పరిచయం కల్గింది కలకత్తా వెళ్లినపుడు మత ఘర్షణలు ఎక్కువయ్యాయి. సాహితీరంగంలో పాండేయ బేచన్ శర్మ 'ఉగ్ర'తో ఘర్షణ స్థితి ఏర్పడింది. దీంతో 'మతవాలా'లో కూడా గొడవ వచ్చింది ప్రచురణకర్తల కోసం నిరాలా ధ్రువుడు, ప్రహ్లాదుడు, భీష్ముడు ఆధారంగా బాలసాహిత్యం రచించినాడు. పంత్‌తో మానసిక సంఘర్షణతో కూడిన సంబంధం కొనసాగింది పంత్ తనను తాను ముక్తఛందస్సు (ఫ్రీవర్స్)కు ఆరంభకులుగా అనుకొనేవారు - 'ఉచ్ఛ్వాస్' కవిత ఆధారంగా, 'పల్లవ్' ప్రచురింపబడింది. దీనికి సంబంధించి నిరాలా మనసులో అనేక ప్రశ్నలు ఉదయించినాయి.

ఒకసారి నిరాలా రోగగ్రస్తుడై కాశీవెళ్లి ప్రసాద్ ఇంటికెళ్లాడు. మిత్రులు తనని ఆప్యాయంగా చూసుకున్నారు నిరాలా 'పల్లవ్' మీద విరుచుకుపడ్డాడు. దీనిలోని లోపాల్ని ఎత్తిచూపాడు. దీన్ని, హిందీ విమర్శ చరిత్రలో ఒక సంఘటనగా పేర్కొంటారు నిరాలాకు 'మాధురి'లో ఉద్యోగం వచ్చి ఉండేది. కాని, తన అర్హతలకు ప్రమాణాలు చూపించి ఉద్యోగం తెచ్చుకోవడానికి నిరాలా తయారుగా లేడు. 'సుధ' పత్రికలో చాలా యేళ్ళు నిరాలా పనిచేశాడు. 'సుధ'లో నిరాలా చేసిన వ్యాఖ్యలు ఆనాటి సాంస్కృతిక పోరాటాన్ని, తీవ్రమైన సామాజిక మార్పుల్ని ప్రతిబింబించేవి.

కూతురు సరోజకు పెళ్లిసమయం రానేవచ్చింది. అనేక గ్రామీణ ఆచారాలు, సంప్రదాయకు తిలోదకాలిచ్చాడు నిరాలా. సాహితీ మిత్రుల వరకే పరిమితం చేశాడు పెళ్లిని వరుడు మామ ఇంట్లోనివాడే. 1929లో 'పరిమళ్' వెలుగు చూసింది భూమికలో కవితా విముక్తి మానవ విముక్తితో సమానమన్నాడు నిరాలా అలంకార వాదానికి వ్యతిరేకంగా జరిగే పోరాటాన్ని తీవ్రతరం చేయాలని నిరాలా 'సుధ'ను ఇందుకు ఉపయోగించుకున్నాడు. ఛాయావాదానికి సంబంధించి ఆచార్య రామచంద్ర శుక్ల గందరగోళంలో వున్నారు ఆయనకు ఛాయావాదం విదేశ అభివ్యక్తివాద రూపాంతరం అనిపించింది నిరాలా శుక్లజీపై వ్యంగ్యం విసిరాడు 'మా కాలేజీ బచ్చా! మరి, ఎఫ్. ఏ. ఫెయిలయినప్పటినుంచి' అని రాశాడు ఛాయావాదాన్ని గురించిన శుక్ల అభిప్రాయాలు నిరాలా అభిప్రాయాలకు భిన్నంకాదు అనేది వేరే సంగతి; నిరాలా ఛాయావాదానికి ఏఏ ప్రత్యేకతల్ని సంతరింపచేశాడో వాటిని దృష్టిలో ఉంచుకొని శుక్లజీకి తన అభిప్రాయాలు మార్చుకోవాల్సి వచ్చింది. తర్వాత శుక్ల నిరాలా బహుముఖ ప్రజ్ఞను గుర్తించక తప్పలేదు. నిరాలా శుక్ల మృతిపై కవిత రాశాడు - 'విమర్శ-అమావాస్య ఆకాశంలోవిరిసినావు నీవు కళాధరుడవై', అని తన నిరుద్యోగం, సరోజ అనారోగ్యం పట్ల నిరాలా బాధపడుతుండేవాడు.

'అలక' అనే నవల 1931లో ప్రచురింపబడింది. గఢకోలాలో తన వాస్తవ జీవితజ్ఞానం బాగా ఉపయోగపడింది గేయాల్లో మనోహరాదేవి సంస్మరణ వెల్లడయింది - 'మనోహరా' - ఈ వేరు చాలు వేదనతో నిండిన సంఘటనలు స్మరించుకునేందుకు - ''కాంతివంతమైన మనోహరా - ఈ ధరణి ధన్యురాలు అడుగడుగునా''. సామాజిక దురాచారలతో నిరాలా ఎప్పుడూ పోరాడుతుండేవాడు అల్హాబాదులో మహావీర్ ప్రసాద్ ద్వివేది అభినందన సభ జరిగింది. నిరాలా దీనిపై 'సుధ'లో మెచ్చుకుంటూ రాశాడు. హిందీలో ఇంకా పాత వాసనలే ఉన్నాయి, కొత్త ఆలోచనలు లేవు అనే గాంధీ, నెహ్రూ అభిప్రాయిల్ని నిరసించేందుకు సంకల్పించాడు నిరాలా. కాంగ్రెస్ నేతృత్వం పట్లనే నిరాలాకు నమ్మకం పోసాగింది. రాజకీయ, సాహితీ రంగాల్లో మార్పుకోరే సమయమది. స్వాతంత్ర్య పోరాటం కొంచెం తగ్గుముఖం పట్టింది ఏదైనా ఒప్పందం కుదుర్చుకోవాలనే వాతావరణం ఉంది. నిరాలాకు ఇది నచ్చలేదు. ముందునుంచి కూడా విప్లవాత్మక మార్పులు కావాలని కోరేవాడు. 1930-33 దరిదాపుల్లో నిరాలా కథాత్మక వచనంలో 'చతురీచమార్' లాంటి పాత్రలు రాసాగాయి. చారిత్రిక దృష్టితో చూస్తే ఇది ఛాయావాదపు అంతిమదశ. ప్రసాద్ ప్రముఖ కావ్యం 'కామాయని' - భావాత్మక చట్రం దృష్ట్యా ఛాయావాద మానసికతా దృష్టి కోణమది - 1936లో ప్రచురింపబడింది నిరాలా వాస్తవికతావాద వ్యంగ్యం, సామ్రాజ్యవాదాన్ని పోషించే, లేక దాని పక్షం వహించే సామంత వాదానికి పూర్తి వ్యతిరేకం

నిరాలా విధినిషేధ రహిత వ్యక్తిత్వాన్ని సహించడం చాలా మందికి కష్టంగా ఉండేది. నైతికత, మానవీయతలకు సంబంధించి నిరాలాకు తనకంటూ కొన్ని గీటురాళ్లున్నాయి సారాయి తాగేవాడు, పాటలు వినేందుకు వేశ్యల దగ్గరికి వెళ్లేవాడు. దీనివల్ల ఆయన మౌలికమైన వైష్ణవత్యం భగ్నమయ్యేది కాదు 1935లో సరోజ చనిపోయింది. సతీవియోగం తర్వాత, ఇది నిరాలా జీవితంలో అతి పెద్ద దెబ్బ. అత్యంత విషాదకరం. లోలోపల నిరాలా కుంగిపోయాడు కాని, తన మానసిక సంఘర్షణను అద్భుతమైన సమతౌల్యంలో వుంచుతూ అదే సంవత్సరం 'సరోజ స్మృతి' కవిత రాశాడు. జీవిత పోరాటాన్ని గాఢంగా వెల్లడించే కవితల్లో ఈ కవిత ముఖ్యమైంది -

''ధన్యురాలా, నీ తండ్రిని, పనికిరానివాణ్ణి
నీకోసం ఏమీ చేయలేనివాణ్ణి
కవితలు రాయడంలో
ఎపుడూ నిమగ్నమై వుండేవాణ్ణి వ్యర్థంగా
నిర్వరామంగా రాస్తూ ముక్తఛందస్సులో -

వాపసు పంపేవాళ్ళు సత్వరమే సంపాదక మహాశయులు
ఒకడి రెండు పంక్తుల్లో ముక్తసరిగా ఉత్తరం రాస్తూ -
దుఃఖమే జీవిత కథ అయింది -
చెప్పడానికి ఇపుడింకేం మిగిలింది ?

పై పంక్తులు నిరాలాలోని వ్యాకులతనూ, తీవ్రమైన మానసిక ఒత్తిడినీ వ్యక్తం చేస్తాయి. నిరాలా పాత సంప్రదాయాల్ని పక్కకు పెట్టి సరోజ వివాహాన్ని జరిపించాడు. ఇది అయనకు ఒక విప్లవమే ఇపుడు ఈ విషాదంతో, ఎక్కడో పరాజితుణ్నయ్యానని అన్పించింది. పోరాట వైఫల్యపు ఈ అనుభవమే మరోవిధంగా 'రామ్ కీ శక్తిపూజ' (1936)లో వ్యక్తమైంది. 'అన్యాయమెక్కడో ఆదిశక్తి అక్కడే' అని అనటం ద్వారా నిరాల తన జీవిత దురదృష్టకర స్థితిని వ్యక్తంచేసేవాడు నిరాలాకు తన పోరాటం ప్రేమ్‌చంద్ పోరాటం లాగా అన్పించింది. నిరాలా అభ్యుదయ ఉద్యమంతో సంబంధం పెట్టుకున్నాడు. ముందునుంచే అయనకు స్పష్టమైవ వాస్తవికతావాద దృష్టి ఉంది 1937లో 'కంకర కొట్టే ఆమె' (తోడ్‌తీ పత్థర్) అనే కవిత ద్వారా సౌందర్య చిత్రణకు సంబంధించి ఒక కొత్త గీటురాయి చూపించాడు. శ్రమ, పోరాటాల సౌందర్యం ఇది. నిరాలా కవితకు కొత్త స్థాపత్యం సంతరించిపెట్టింది ఇది అనుభూతవస్తువు, రూపనైపుణ్యం ఆతనికి సహజం 'సరోజ - స్మృతి'లాంటి దీర్ఘకవితలు రాసేపుడు నిరాలా తన గేయాల రచనా విన్యాసంపై 'మాధురి'లో వ్యాసాలు రాసేవాడు. 1938లో నిరాలా మృత్యువును దర్శించాడు - ఒకవిధమైన తీవ్ర మానసిక అశాంతిని అనుభవించాడు నిరాలా.

నీ ముద్దు ముచ్చట్లు
ఈ నాడు విషపాత్రలు
నవ్వుతూ చెబుతున్నావు కదూ;
''తాగండి! తాగండి!
గత్యంతరం లేదు
మృత్యువులో వచ్చినముక్తిని నేను
ఇక భయమెందుకు?''

ఈ సంవత్సరమే నిరాలా 'ముక్తి', 'ఖులాఆస్‌మాన్' లాంటి కవితలు రాశాడు. వాటిలో పోరాట పటిమ, జీవితం పట్ల ఉత్సుకతతో కూడిన రహస్యోద్ఘాటన వున్నాయి - జీవితం పట్ల ఓ రకమైన సహజ స్వీకృతి వుంది

పడగొట్టు, పడగొట్టు, పడగొట్టు, కారాగారాన్ని
స్పష్టంగా కన్పిస్తోంది ఆకాశం
చాలా రోజుల తర్వాత
కాసింది ఎండ, ఉల్లసితం ఈ విశ్వం
ఒంటరివాణ్ణి గమనిస్తున్నా,
ఆసన్నమయింది నా జీవన సాంధ్యవేళ''

1937లో నిరాలా 'వన్‌బేలా' (అడవిమల్లె) రాశాడు. ఈ సంపుటిలో వ్యంగ్యం, వేదనలతో కూడిన స్వరం ఉంది - నేనూ రాజపుత్రుణ్నైతే'లో లాగా.

1938లో పంత్, నరేంద్రశర్మల సంయుక్త సం పాదకత్వంలో 'రూపాభ్' ప్రచురణ మొదలైంది. దీనికి ఒక కొత్త గేయం పంపాడు నిరాలా - 'సహజ్ సహజ్ పగ్ ధర్ ఆవో ఉతర్.' గేయం చట్రంలో ఇది ఒక సరికొత్త కంఠస్వరం గమనించాల్సిన విషయమేమంటే, పూట గడవాలంటే నిరాలాకు చాలా పనులు చేయాల్సి వచ్చేది. అనువాదాలు ఎక్కువగా అలా చేసినవే. 1940లో నిరాలా ఒకపక్క వ్యంగ్యం రచించేవాడు - ('బాపూ, నువు కోడిమాంసం తింటే') లాంటివి. మరోవైపు విషాదం, ఒంటరితనమూ నిండిన కవితలు రాసేవాడు.

'నే నొంటరినై
చూస్తున్నాను నా జీవన సంధ్యాసమయం'

ద్వితీయ ప్రపంచయుద్ధం తర్వాత జీవితంలో ఎదుర్కొవలసి వచ్చిన కష్టాల పట్ల నిరాలాకు ఎరుక ఉండేది. 1941లో 'కుకుర్‌ముత్తా' (పుట్టగొడుగు) ప్రచురణ కావ్యజగత్తులో ఒక సంఘటన. కవిత్వపు ఆభిజాత్యంపై అది ఒక పెద్ద దాడి దేశంలో స్థితి గందరగోళంగా వుండేది. వేదాంతం, సమాజవాదం, కాంగ్రెస్-అన్నిటిపైనా నిరాలా నమ్మకం సడలసాగింది. ఈ మనస్థితిలోనే నిరాలా 'భిల్లేసుర్ బక్‌రిహా' రచించాడు 'కర్వీ'లోనిరాలాకు జబ్బుచేసింది. 43లో 'అణిమ', 46లో 'బేలా', 'నయేపత్తే' శీర్షికలతో నిరాలా కవితా సంపుటులు వెలుబడ్డాయి. 46లో అకస్మాత్తుగా నిరాలా ప్రయాగ వదిలివెళ్లాడు. 47 తర్వాత నిరాలాలో ఉన్మాదం బాగా వ్యక్తమయింది. 27 జనవరి 47న కాశిలో ఆయన స్వర్ణజయంతి ఏర్పాటు చేశారు. ఏర్పాటు చేసినవారు నందదులారే వాజపేయి. నిరాలాకు 11వేల రూపాయులిచ్చారని వినికిడి, దీన్నిపై వివాదం చెలరేగింది.

1948లో 'హంస్' పత్రిక 'దమన వ్యతిరేక' సంపుటి వెలుపడింది. 47నుంచి 49వరకూ నిరాలా సన్యాసివేషంలో వుండేవాడు. 'అర్చన'లోని గేయాలు 1950లో రాసినవి 1958లో బరువా కలకత్తాలో నిరాలాను అభినందించాడు. మానసిక వికలత పెరుగుతూనే వచ్చింది దారాగంజ్ (ఇలాహాబాద్) పాండాలూ, పూజారులూ, కూరగాయులు, పండ్ల అమ్మేవారూ, రచయితలూ, విద్యార్థులూ-అన్నిరకాల వాళ్లూ ఆయన పరిచయ పరిధిలో ఉండేవారు. నిరాలా ఈ మధ్య ప్రార్థనాపరమైన కవితలు రాస్తూ వచ్చారు. 'ఆరాధన' (1950) అచ్చయింది. కాని, ఆశ, అనురాగాల రంగుమాయమై పోలేదు. ''మామిడిపూత విరజిమ్మింది, విరుచుకు పడినాయి తోటల్లో తుమ్మెదలు.'' నిరాలా వ్యక్తిత్వాన్ని గురించి రాస్తూ, రామ్‌విలాస్‌శర్మ సరిగానే అన్నారు-'నిరాలా సగం సన్యాసి, సగం భోగి' అని 1950లో నిరాలా అనుభవించిన పరాయీకరణకు ఈ కింది పంక్తులు నిదర్శనం ·

ఓటమి చవిచూసిన లోకం
విషంతో నిండిపోయింది
సరైన పరిచయం దొరక్క
జనాలు జనాల్ని చూస్తున్నారు.

ఆధునికతావాద ఆగమనంతో దిగుమతి చేసుకున్న, అనుభవ రూపంలో నయా బుద్ధిజీవులను ఆకర్షించిన 'పరాయీకరణ' కాదిది. ఈ భారతీయ పరాయీకరణకు కొన్ని గట్టి సామాజిక కారణాలున్నాయి. వీటిని తన మానసిక గందరగోళ పరిస్థితిలో కూడా నిరాలా బాగా గుర్తించేవారు.

దీర్ఘకాలంపాటు నిరాలా మానసిక రోగగ్రస్తులవడం కలతచేందించే దురదృష్టకర సంఘటన. దీని వెనకాల ఒక కఠోర జీవిత పోరాటంతోపాటు, అనేక ఆంతరిక, బాహ్యకారణాలు కూడా వుండినాయి. తన ప్రతిభకు తగిన గుర్తింపు రాలేదని నిరాలా భావించేవాడు. ఆయనను అంగీకరించిన వారికంటే, తిరస్కరించిన వారే ఎక్కువ. తాను ఇలా తిరస్కరింపబడటం నిరాలాకు బాధ కలిగించేది. ఇపుడాయన ప్రపంచమే వేరయింది. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం 'అపరా' అనే కవితా సంపుటికి 21వేల రూపాయుల పురస్కారం ఇస్తే ఆయన అన్నాడు - ''నిరాలా దానం తీసుకోడు. 21 వేలు ఎంతటిది? నా లెక్క లక్షల్లో వుంది అంతా కలిపే తీసుకుంటాను.'' మాస్కోలో కవిత విన్పించాననీ, రవీంద్రనాథ టాగోర్ గీతాంజలి తానే రాసిన అప్రౌఢ కృతి అని, అంటుండేవాడు. తులసీదాసును కూడా వదిలిపెట్టలేదు. జనంతో అంటుండే వాడు - 'నేను నిరాలాను కాను - తుత్తన్‌ఖాన్ కొడుకు ముత్తన్ ఖాన్‌ని గామా, జెనిస్కో, టాగోర్ - వీళ్లందిరినీ ఓడించాను.''

ఈ విక్షిప్త దశలో కూడా నిరాలా కవితలు రాస్తూనే ఉండినాడు. మానసిక అశాంతి ఎక్కువైనా, అభివ్యక్తి మార్గాన్ని వెదుక్కునేవాడు. అసహజ స్థితిలో, స్మరించే మృత్యువూ, శృంగారానికి సంబంధించిన నిరాలా అనుభూతి స్ఫోరక భావచిత్రాలు చాలా సహజమన్పించేవి నిరాలా మనసు చాలా దొంతరలలో ప్రతిస్పందించేది. అతనితో పోరాడేందుకు విరోధులు ఏకమైనారని, వారందరితో తానొక్కడినే తలపడాలనీ నిరాలాకు అన్పించేది. దాడికి సిద్ధంగా గంగలో మొసళ్లు దండిగా వున్నాయి. నిరాలా శరీరం ఇపుడు అనేక రోగాలకు నిలయం. నరకం లాంటి స్థితి. భయం, అపనమ్మకం, అశాంతితో నిండిన నరకంలో నివసించే నిరాలా అభిశప్తుడు-లోనుంచి, బయటనుంచి ఇది ఆతన్ని కుంగదీసింది. సంఘర్షణ క్షణాలే కాకుండా, మధుర స్మృతులకు ప్రేరకమై తనకు రాగాత్మక శక్తినీ, స్ఫూర్తినీ ఇచ్చిన గఢకోలా, డల్‌మపూలకు వెళ్లాడు నిరాలా. అక్కడ నిరాలాకు క్రూర స్వార్థపరుల నెదుర్కోవలసి వచ్చింది. మనసుకు తగిలిన ఈ గాయం ఎంత తీవ్రమైనదో ఊహించాల్సిందే. నిరాలా తన మూలాలను తానే నిర్మూలించుకుంటున్నాడు. తన జన్మను గురించిన కొత్త కధ అల్లి విన్పించడమూ తనను ఆహార సంపద కల్గిన రాకుమారుని రూపంలో చూసుకోవడం, ఫ్రాన్స్‌కు విమానంలో వెళ్లి, దిగినపుడు విక్టోరియా మహారాణి తనకు స్వాగతం పలికినట్లు ఊహించుకుంటాడు. మహిషాదళ్ గుర్తుకొస్తుంది, దాని సస్యశ్యామల ప్రకృతి, అనురాగ సంపద, తన ఖండిత, శిథిల జీవితాన్ని కూడా కొత్త ఆనందంతో నింపుతోంది. నిరాలా పోరాటం, నిరంతర పోరాటం, ఇపుడు ముగియనుంది.

1958లో నిరాలా రాశాడు .

> నిప్పు అంతా ఆరిపోయింది
> ఆ రాగిణి ఆగిపోయింది
> జీవితం నేడు కేవలం స్మృతిగా మిగిలిపోయింది
> మృత్యురేఖ నీలంగా ఆగుపించసాగింది.

1956లో రష్యన్ భాషలోకి నిరాలా కవితలు కొన్ని అనువదించబడినాయి. 1960 వసంత పంచమి. మృత్యువు దగ్గరవుతోంది. నిరాలా ఆఖరి కవిత రాశాడు -

> ''ఎపుడూ రాయడానికి తహతహలాడే
> జీవిత విషం ఉపశమించింది''

నిరాలా జీవితమూ, రచయితగా అతని జీవితమూ - రెండూ పోరాటమయమే. పోరాటం ఆతన్ని కలచివేసింది, సానబెట్టింది. ఛాయావాద యుగంలో, బహుశా ఛాయావాదోత్తర యుగంలో కూడా నిరాలా లాంటి ప్రతిభ వున్న సృజనాత్మక రచయిత మరొకరు లేరు అన్ని విధాలా, వ్యక్తిత్వమూ, కృతిత్వమూ రెంటి దృష్టితోనూ నిరాలా హిందీ జాతీయ సృజన స్రవంతిలో అద్వితీయులు. ''బహిష్కరించారు నన్ను, కాని అంతరంగంలో పూర్ణత్వం సిద్ధించింది నాకు'' - నిరాలా వ్యక్తిత్వాన్ని, ఆయన బహిరంతర పోరాటాన్ని ఈ నిరాలా పంక్తులు చాలావరకు వ్యక్తం చేస్తున్నాయి.

# 3. విస్తృతానుభవానికి అర్థం

స్వాతంత్ర్యం, ప్రకృతి, ప్రేమ, ఆంతరిక పోరాటం, స్వయం సాక్షాత్కారం, మృత్యువు నిరాలా కవిత్వ విషయ వస్తువు. వీటికి ఒక క్రమం లేదు. ఎప్పుడు ఏ భావ-సందర్భ కవితలు రాశాడో చెప్పలేం అంతిమ దశలో ఆయన ప్రార్థనాపరమైన కవితలనేకం రాశాడు. కాని ఈ కవితలు కూడా 'ఓడిన వాడికి దేవుడి స్మరణ' అనే ఫక్కీలో లేవు. వీటిలో కూడా ఆధ్యాత్మిక ప్రేమ, లేక సమర్పణ భావంకాక, నిరాలా వ్యక్తిగత అనుభూతి స్వరం ఉందని ప్రత్యేకించి పేర్కొనవచ్చు ప్రార్థనా కవితలు కూడా సరళమైన చచ్చు కవితలు కావు. ప్రేమ, లేక ప్రకృతి సంవేదన నుంచి మృత్యువు నెదుర్కొనే దశకూ, మృత్యువరణము నుంచి అపరిమిత మానసోల్లాస క్షణం వరకూ నిరాలా ఎపుడు పోతాడో చెప్పడం కష్టం. ఒకపక్క నిరాలా స్వగతం కొన్ని కవితల్లోవుంటే, 'స్వ'ని అతిక్రమించడం కూడా కొన్ని కవితల్లో కన్పిస్తుంది.

'అహం' శైలిని అవలంబించాను నేను
ప్రతి దుఃఖితుణ్ణి భ్రాతృభావనతో చూశాను
నా హృదయమందు విషాద ఛాయ ప్రతిబింబించింది
వెంటనే ఆవేదన పొంగి పారలింది

1923లో రాసిన 'అధివాస్' అనే కవితలోని పై పంక్తులు నిరాలా అనుభూతి జగత్తులోని ప్రత్యేకతను, లేక ప్రత్యేక గతి తర్కాన్ని వ్యక్తం చేస్తాయి. ''నేను''తో మిగతా

ప్రపంచ ప్రగాఢ సంబంధాలు కొన్ని సమయాల్లో స్వాభావికంగానూ, కొన్ని సందర్భాల్లో సంక్లిష్టంగానూ, కన్పిస్తాయి నిరాలాలో. ఈ సంబంధం బహురూపాత్మకం.

**'విప్లవ జలధరమా గర్జించు' :**

మొదట నిరాలా కవిత్వంలోని స్వాతంత్ర్య అనుభూతి సన్నివేశం చూద్దాం. కావ్య రచనలోకి మొదటి దశలో రాసిన కవితల్లో నిరాలా మాటమాటికీ ఈ స్వాతంత్ర్య భావావేశాన్ని స్పష్టపరుస్తాడు. బంధరహిత, స్వేచ్ఛాయుత చండ ప్రచండ విరాట్ శక్తి పట్ల నిరాలాకున్న ఆకర్షణను అతని కవితలు 'బాదల్‌రాగ్', 'ధార', 'ఆవాహన్', 'జాగోఫిర్ ఏక్‌బార్' లాంటి కవితల్లో మనం చూడొచ్చు. ఈ కవితలు నిరాలా మౌలిక విప్లవ తత్వాన్ని వ్యక్తం చేస్తాయి. నిరాలా ఒక పక్క భారతదేశాన్ని పరాయిపాలన నుండి విముక్తం చేయాలని కోరతాడు, మరోపక్క భారతీయ సామాజిక జీవితంలో సార్థక పరివర్తన రావాలని కోరుకుంటాడు. నిరాలా పెట్టుబడిదారీ వాదాన్ని వ్యతిరేకిస్తాడు. దీనితో పాటు సామ్రాజ్య వాదాన్ని, భూస్వామ్య విధానాన్ని కూడా వ్యతిరేకిస్తాడు. ఒక వ్యాసంలో నిరాలా ఇలా అంటాడు -

''విప్లవం సాహితీజనని. నవ్యత అప్పుడే వస్తుంది. దీన్నే జీవితమంటారు. ఋతువు మారుతూనే భూమి ఎలా కొత్త రూపం ధరిస్తుందో అలాగే విప్లవజనిత నవ్యతవల్ల సాహిత్యం కూడా సరికొత్త రూపం సంతరించుకుంటుంది ''

విముక్తి కోసం నిరంతర పోరాటం నిరాలా స్వభావం. మానవ విముక్తి, కావ్య విముక్తి రెండూ ఒకటేనని నిరాలా భావన. 'ప్రగల్భ ప్రేమ'' అనే కవితలో ఛందోబంధనాల ఇరుకుదారినీ అనేక జీవిత అంధకావిశ్వాసాలనూ తొలగించుకోవాలనే కోర్కెను నిరాలా ఇలా వ్యక్తం చేస్తాడు -

> ఇంకే కోరికాలేదు నాకిపుడు
> ఈ అర్ధ వికసిత హృదయంలోకి ప్రవేశించు
> ప్రేయసీ, వదిలిపెట్టు ఛందస్సుల పరిష్వంగాలు, క్షుద్రరహదారులు.

'బాదల్‌రాగ్' కవితలో నిరాలా విప్లవరావంతో అందమైన చిరుమొక్కను చూసి దానిపట్ల ఆత్మీయత పెంచుకుంటాడు. మేఘగర్జనతో, సకల సౌకర్యాలు అనుభవించే సంపన్న వర్గం భయకంపితమైంది. మేఘం దేనికి ప్రతీకో చెప్పాల్సిన పన్లేదు.

> చిన్ని చిన్ని మొక్కలు నవ్వుతూ అలవోకగా
> అనంతంగా వ్యాపించిన గడ్డి పోచలు

కదుల్తూ కదుల్తూ
వికసిస్తూ వికసిస్తూ
చేతులూపుతూ
చేతులూపుతూ
నిన్ను పిలుస్తున్నయ్
విప్లవరవంతో చిన్నవే మరింత శోభనిస్తున్నాయ్.

నిరాలా జాతీయ స్వాతంత్ర్యం, నవజాగృతి పట్ల స్వాభావికంగా ఆసక్తి చూపిస్తాడు, సగర్వంగా అనుభూతి చెందుకూ -

దిశ తెలిసింది
తూరుపు దిక్కున ఆకసంలో సరికొత్త రూపంలో
పయనించేందుకు పుట్టాడు సూరీడు.

స్వాతంత్ర్య చేతన పట్ల మమకారం ఛాయావాద కవులకు ఒక నవ్యదృష్టిని ఇచ్చింది ఇందులో విస్తృత కల్పన, స్వతంత్ర అభివ్యక్తి రెండూ ఒకదాని నుంచి మరొకటి వేరుపడి లేవు. సచేతనమైనదేదీ పరాయిపెత్తనం సహించదు ధార ఏ అవరోధం లేకుండా ప్రవహిస్తుంది. అది ఏ అడ్డంకుల్నీ అంగీకరించదు.

సకల బంధనాలూ నేడు సడిలినాయి
ప్రాణం విముక్తమయింది
కారుణ్య క్రందనమంతా ఆగిపోయింది.

నిరాలాకు ''సాతంత్ర్యం'' అంటే అనేకార్థకం. 'తెలుసు నాకు ఒకే ఒక పదం-స్వాతంత్ర్యం' అని అంటూ కూడా దాని విస్తృతార్థాన్ని సంకేతిస్తాడు నిరాలా.

హర్షాతిరేకంతో ప్రతిధ్వనిస్తోంది అంతటా స్వాతంత్ర్యం
విపుల ఉల్లాసమయ విశ్వం క్షణ క్షణంలో
మహావృక్షాల క్రుద్ధ భూధరాల కణకణంలో.

కాలం మారుతూంటుంది - ఋతువులు మారుతుంటాయి-రోజులు, పక్షాలు, మాసాలు మారుతూనే వుంటాయి. నిరాలా ఈ పరివర్తన చేతన పట్ల జాగరూకత వహిస్తాడు. జాగృతిని ఆహ్వానిస్తాడు నిరాలా. ఇలా ఆహ్వానిస్తున్నపుడు నిరాలాకు తెలుసు పరివర్తన దిశ ఏమిటో -

ఉదయించాడు రవి అరుణాచలంపై
కవిస్వరం సరస్వతీమయం అయింది
ప్రకృతి దృశ్యాలు ప్రతిక్షణమూ
పరివర్తితం కాజొచ్చినాయి
పగలు పోయింది, రాత్రి వచ్చింది
రాత్రి పోయింది ఉదయమయింది

ఎన్నో దినాలు, పక్షాలు, మాసాలు గడిచాయి. ఎన్నో ఏండ్లు గతించాయి - మరోసారి మేల్కొను

నీవు సదా విముక్తుడవు
ముక్త ఛందంలా
ఆనందంలో మగ్నవై, సచ్చిదానంద రూపమై.

'విముక్తి'కి ఆధ్యాత్మిక అర్థాలు కూడా వుండొచ్చు కాని, లౌకిక అర్థాన్ని - జాతీయ సందర్భాన్ని వదిలి మాత్రం కాదు.

### చూపు మరల్చాలని అన్పించింది :

నిరాలా కావ్య సంవేదనలో అంతర్భాగం అతని ప్రకృతి సంవేదన. ప్రకృతి నిరాలాకు ఒక సజీవ వాస్తవికత ప్రకృతి అనుభూతిలో రూపము, రుచి, రంగు, వాసన, స్పర్శ మరో పక్క శబ్ద సమ్మిళిత సంశ్లిష్ట చేతన నిరాలా కావ్య ప్రపంచంలో వ్యాపించి వున్నాయి. నిరాలా జీవితమంతా ప్రకృతిపట్ల ప్రగాఢ అనురక్తి, అనుభూతి పొందేవారు. నిరాలా ముందు ప్రకృతి కోమల సుకుమార రూపంలో రాదు - తన విరాట్ స్వరూపం ప్రదర్శిస్తూ అది ఒక సవాలుగా ప్రత్యక్షమౌతుంది పూర్వ మహాకవుల మాదిరే నిరాలా ప్రకృతిని చూస్తాడు. ప్రకృతికి సంబంధించిన కొన్ని ఉత్తేజకర రూపాలు, దృశ్యాలు, అనుభూతులు, నిరాలా కావ్యయాత్రలో కన్పిస్తాయి. ఉదాహరణకు వసంతం, హోలీ అనుభవాలు. ఈ అనుభూతి ఒక్కోసారి సంగీత రూపంలో వ్యక్తమవుతుంది. మరోసారి జానపద గేయల్లాంటి సహజ రచనలో. ఈ రెండు రూపాల్లోనూ ప్రకృతి-కవికి ఒక సమగ్ర జీవనం, మనిషిని సుసంపన్నం చేసే సమగ్రజీవనం వ్యక్తం అవుతాయి -

'జాజిమొగ్గ', 'శేఫాలిక' లాంటి ప్రారంభ కవితలు ప్రకృతి శృంగార రూపాన్ని వ్యక్తం చేస్తాయి. 'రవికముడులు విప్పే ప్రేమతో పోటమరించిన యౌవనం / చిగురుటాకు శయ్యపై నిద్రిస్తూ శేఫాలిక!' 'యమున పట్ల' శీర్షికతో రాసిన కవితలో నిరాలా చరిత్ర స్మృతితో,

విషాదభావంతో ప్రకృతి అంతరంగికతను గుర్తిస్తాడు - గట్టుపై మౌనంగా, నిర్లిప్తంగా పడివున్న రాగిణిని గుర్తిస్తాడు. 'సంధ్యాసుందరి' అనే కవితలో నిరాలా సూక్ష్మవాతావరణాన్ని, నీరవత్వాన్ని శాంతిని ఆవిష్కరిస్తాడు. నవ్యకల్పన, నవ్య అభివ్యక్తి కారణంగా, సంధ్య ఒక సరికొత్త రూపంలో దర్శనమిస్తుంది. నిరాలా ప్రకృతి చిత్రాలు ప్రగాఢ ఐంద్రియ రాగాత్మక స్పర్శతో కూడి వుంటాయి.

అలసత్వానికి లతలా
కోమలత్వానికి మొగ్గలా
నీరవత్వపు సభుజంపై చేయిడి
ఛాయలా ఆకాశపథాన నడిచింది.

- సంధ్యాసుందరి

వసంతఋతు చిత్రాల అలంకృత బాష్ప
అనుభవరాగ దీప్తి మనల్ని ఆకట్టుకుంటుంది -
వచ్చేసిందొచ్చేసింది వసంతం, సఖి
ప్రతిమదిలో హర్షాతి శయం
కిసలయవసనయై, నవవయోలతిక్షపై
ప్రియహృదితో కలిసే వృక్షపతిని
మధుప బృందానికి బందీయై
దశదిశలా కోకిల స్వరం రసరంజితమాయె

నిరాలా వర్ణించిన ఈ వసంతదృశ్యం లేక ప్రకృతి దర్శనం, తర్వాత వచ్చిన కవితల్లో కూడా కన్పిస్తుంది. ఉదాహరణ :

''మామిడి పూత పూచింది
వనమంతా విరుచుకుపడినాయి తుమ్మెదలు
ఆబీర్‌తో ఎర్రబడిన తలలు
సింధూరంతో ఏర్రనైన చెక్కిళ్లు,
'గులాల్'తో ఎర్రబడిన కళ్లు,
ఎర్రమట్టి గడ్డలు పొడి కొట్టినట్లు.

మునుపటి అలంకారిక శైలితో పోల్చి చూస్తే, భాషలో కొత్తగా వచ్చిన సరళత్వం గమనార్హం. ఫాల్గుణ కాంతిని కవి పోగు చేయలేక పోతాడు. హోలీ అనుభవాలు కవికి కొంగ్రొత్త అనురక్తి, విహ్వలత ఇస్తాయి. ఈ అనుభవం కవిదేకాదు, అందరిదీనూ -

'కంటినరాలు ఎర్రవాయె గులాల్ పొడితో, హోలీ వచ్చె, వచ్చె హోలీ'1 'వర్షాచిత్రాల సంవేదనాత్మక అనుభూతి నిరాలాకు చాల ప్రియమైన వస్తువు. నిరాలా ప్రసిద్ధ వర్షాగీతి చూడండి -

వర్షకాభ్రములు కమ్ముకొనె సఖీ !
ప్రియుడు ఇంటిని వదిలినప్పటినుంచి
ఎన్నో మనోజ్ఞ దృశ్యాలు మది మెదలె రెప్పపాటులో
శక్తికి మించిన దృశ్యావళి ఇది మరి

నిరాలా ప్రకృతి అనుభూతుల్లో 'నిరభ్ర ఆకాశ' ఆనందదాయక జీవనానుభూతి వుంది. 'మండుటెండలో దీర్ఘకాలం ఎండుతున్న జీవనజ్ఞానం' ప్రకృతి అనూభూతి నవ్యత, నవ్య అభివ్యక్తి స్పర్శతో వ్యక్తమైంది. మేఘాలపై వచ్చిన గేయాల్లో, కవితల్లో ఈ కింది పంక్తులు ప్రత్యేకించి స్మరణీయం -

మబ్బులు కమ్మినాయి ..
నా కన్న కలలు
కళ్లలోంచి వచ్చి తిరుగాడినాయి

నిరాలా వర్షా గీతాల ఆధారంగా రాసిన పాటలు రాజకీయ ఆశయాల్ని వ్యక్తం చేసాయి. హోలీ పాటలు, విరహం, ఒంటరితనం, ఆత్మవ్యధతో నిండిన గేయాలుగా ఎలా మారతాయో చూసి తీరాల్సిందే. ప్రకృతి పట్ల భయంకరమైన మానసిక అశాంతిని అనుభవిస్తూ నిరాలా రాస్తాడు -

శిశిర రాత్రి
క్రూరజంతుమయం

ఇలాంటి గీతాలకు మనోవైజ్ఞానిక వ్యాఖ్య చేయొచ్చు కాని, నిరాలా గతితార్కిక కవి - స్వభావాన్ని సరళీకరించడం అనవసరం. అలా చేయడం మౌలిక కావ్యానుభూతిని అస్వీకరించడమే అవుతుంది.

## ఆ నావనిచట బంధించకు మిత్రమా :

నిరాలా ప్రేమకవి - ప్రసాద్‌ను ప్రేమ కవి అంటామే - పూర్తిగా ఆ అర్థంలో కాదు. నిరాలా ప్రేమానుభూతిని వ్యాఖ్యానించడం సులభం కాదు. ఒక జీవిత పూర్ణత్వ అనుభూతి, ప్రగాఢ ఆంతరికోల్లాస అనుభూతి - ఛాయావాదుల విరహావిదగ్ధ

మానసికతత్వం కాదు నిరాలాది. నిరాలా ప్రేమ ఒక నవ్య విముక్తికి వ్యక్తీకరణ. స్మృతి, విషాదం, నిరాలా ప్రేమభావనలో భాగాలే, కాని వాటి స్వభావం వేరు. శృంగారాన్ని ఉదాత్తత వైపు తీసుకుపోవడంలో నిరాలా సమకాలీనులకు భిన్నం. ఇందులో ప్రకృతి, ప్రేమోత్సవంలో క్రియాశీల పాత్ర వహిస్తుంది అది ప్రణయలీలను ఉత్తేజపరచడం, ఉద్దీపింప జేయడమేకాదు, తనలో మానవీయ అనురక్తి, స్పృహ నిక్షిప్తం చేసుకొని వుంటుంది. నిరాలా, తృప్తి, అసంతృప్తుల ద్వంద్వంలో విద్యాపతి ప్రేమభావనకు దగ్గరగా వుంటాడు. మనం ఏమిటో అలానే వుండాలి

చేయి చేయి పట్టుకొని
అతిశయ సుఖసంద్రంలో ప్రవహిద్దాం
రెప్పలు మూసుకు హృదయంలోకి చూద్దాం
కథంతా విందాం రండి పరిమళ స్వరంలో
ఎవరైనా ఏమైనా అంటే అననీయండి
- రండి.

ప్రగాఢ సంయోగ శృంగార రసానుభూతులు కామచేతన స్పర్శను వ్యక్తం చేస్తాయి 'స్పర్శతో సిగ్గేసింది' - అనే గీతంలో ప్రణాయాకాంక్షను ఇంద్రియ చేష్టలతో అభివ్యక్తం చేయసాగాడు నిరాలా.

చుంబన-చకిత, చతుర్దిశలా చంచల
ముఖం చూసి తిప్పి, సుఖక్రీడలు చేసి
ఒకప్పుడు హాసం, మరొకప్పుడు భయం శ్వాసబలంతో,
హృదయసరిత ఉప్పొంగింది -
నవ్యప్రేమ నయనాలు వైకెత్తి
నెలవంకలాటి చూపు
మనసులో సుమధుర కలరవం
గొంతులో మిగిలింది ఏదో బాధ.

నిరాలా శృంగార చేతనను గురించి రాస్తూ, రామ్‌విలాస్ శర్మ అంటాడు - నిరాలాలో నైతికతావాదుల నిషేధభావన లేదు, రీతివాదుల కామోద్దీపన లేదు, భావకవుల కల్పనా సౌందర్యం లేదు

ఇక్కడ శారీరిక, అశారీరిక ప్రేమ, లౌకిక ప్రేమ, విశ్వప్రేమ అనే విభజన లేదు ప్రేమ

లౌకిక, శారీరిక అనుభవాల్లోనే వాంఛిత పూర్ణత సంతరించుకొంటుంది. 'పంచవటీ ప్రసంగ్'లో రాముడు అంటాడు -

చిన్న ఇంటి చిరుపరిమితుల్లో
ప్రబలిస్తాయి క్షుద్ర భావాలు
ఇది సత్యం, సఖీ
ప్రేమ పయోధి పొంగిపొరలుతోంది
అను నిత్యం అనంత పృథ్విపై

హృదయంలో ప్రథమ అజ్ఞాత కాంతిలా ప్రేమ జనిస్తుంది. అదే విశాల భావ ప్రసారానికి, భావసృష్టికీ కారణమవుతుంది.

నా అధరాల కది
ప్రథమ కంపనం
ప్రథమంగా పూర్వస్మృతి
నా కన్నుల్లో,
ఏదో ప్రథమ అజ్ఞాత కాంతి హృదయంలో -
ఒకే తత్వపు కేంద్రాలు
రెండూ ఒకటయ్యాయి
సృష్టికిని కారణాలు
కవిత్వపు కామబీజాలు ( రేఖ )

'ప్రేయసి' కవితలో పొంగిపొరలే యౌవనలహరిని ప్రగాఢ ప్రేమాకాంక్షతో చూసే ప్రయత్నం కన్పిస్తుంది ప్రేమభావన ప్రథమ కిరణాన్ని ప్రతిసారి గుర్తుచేస్తాడు నిరాలా.

ప్రథమ కిరణ కంపనం ప్రాచీ దిశలో
ప్రథమ పులకరింత పుష్పచుంబిత
వసంత మంజరీ లతపై
ప్రథమ సంగమ గానం
ప్రథమంగా విరబూసిన మొగ్గ వృంతంపై నగ్నంగా
ప్రథమ పవనపు స్పర్శతో కంపనం

ఈ ప్రేమాంగీకారం వెనక ప్రేమకున్న నూతన సామాజిక ఆధారం కూడా కన్పిస్తుంది.

మా ఇద్దరి రంగు భిన్నం
కులం భిన్నం వర్ణం భిన్నం
మతం భిన్నం, భావం భిన్నం
కాని, ఆత్మీయతలో
ప్రాణంలో, మేం ఒక్కరం.

జీవన వీణ నుంచి పుట్టే సంగీతమే ప్రేమ. దీన్ని విని వూరకుండ లేము. విముక్తులమై కలిసి నడవడం సహజం, అనివార్యమూ ఆయిపోతుంది -

ప్రియుని గొంతు విని వచ్చాను నేను ద్వారం వద్దకు
జీవనవీణ ఝుంకారం -
విన్పించని ఆ ధ్వని
నే వింటున్నా -
తెలిసిపోయింది నాకు, చేయి చాచి పరిగ్రహించావు నీవు నన్ను
వచ్చేశాన్నేను నీతో విముక్తనై

నిరాలా ప్రపంచం విలక్షణమైంది ఇందులో ప్రేమానుభూతి వర్ణం అపరిచిత, అప్రత్యాశిత రూపంలో శ్వేతం కూడా కావచ్చు. ఈ భేదం మారిన భావచేతనకు నిదర్శనం ఈ సరళ అభివ్యక్తి వెనుక ఒక నవ్య ప్రణయాకాంక్ష వుందనేది స్పష్టం.

చెట్టుకింద కూచుని
వుంటివి నిండుగా
కళ్లనుంచి పక్షులెగురుతున్నాయి
తెల్లచీర కట్టుకున్నావు
భావాల్లో ఏ రహస్యం లేదు
జనం నీ రూపాన్ని ఆస్వాదించారు
నేను మాత్రం బయటకి నెట్టివేయబడ్డాను

నిరాలా కావ్యప్రపంచంలో అంతస్సంఘర్షణ, స్వీయసాక్షాత్కారపు అనేక అనుభూతి చిత్రాలున్నాయి వాటి ఆధారంగా నిరాలా "నేను" మిగతా ప్రపంచ వాస్తవికతతో తలపడటం చూడగలం. నిరాలా బహుశా పోరాటంలో, ద్వంద్వంలో కన్పిస్తాడు. ఆయన ఒంటరితనం అనుభవాలు కూడా ఆతని విస్తృత పోరాట చేతనను ప్రతిఫలిస్తాయి ఇంటా బయటా నిరాలా ఒక తీవ్ర మానసిక అశాంతికి లోనయ్యేవాడు ఇది ఒక సార్థక అనుభూతి;

అతని వ్యక్తిత్వ, వాతావరణ ద్వంద్వాల దగ్గరకు తీసుకుపోయే సార్థక అనుభూతి. ఆత్మఘర్షణ వున్న కవితల్లో తన అభిప్రాయం ఇలా వ్యక్తం చేస్తాడు -

మరణించను నేనిపుడే
ఇపుడిపుడే కదా వచ్చింది
నా మానసంలోకి మృదు వసంత ఋతువు.

అలా వుంటూనే కొన్ని చోట్ల కవి ఒంటరితనపు జీవనానికి దగ్గరపడం చూస్తాం.

నే నొంటరి వాణ్ణి
గమనిస్తున్నా నా జీవనదీప
సాంధ్యవేళ, సమీపిస్తోందని.

ఈ భేదం కాలానిది కూడా, మారుతున్న యదార్థానిది కూడాను. 1942లో నిరాలా రాశాడు -

అర్పించాను నేను జగత్తుకు ఫలం - పుష్పం
చేశాను స్వయంప్రభతో చమత్కృతం
అయింది ఆ పల్లవితక్షణం అశాశ్వతం -
జీవితపు తళుకు బెళుకు అదే -
కూలిపోయింది ఇపుడంతా.

ఇలా అనడంలో, ఈ స్వీయవిషాదం వెనుక జీవితపు కఠోర యథార్థం వుంది. కాని ఇటువంటి చోట్ల కూడా నిరాలా మానసిక గ్రంథిని అనుభవించడు అయన కంఠస్వరం - కేవలం నిరాశా విస్మృహలను వ్యక్తం చేయుదు - ఒక దృఢమైన జీవనశక్తిని కూడా వ్యక్తం చేస్తుంది. ఏకాంతంలో కూడా పోరాటం నుంచి పలాయనం చిత్తగించడు నిరాలా. తన స్థితిని నిర్మొహమాటంగా విశ్లేషించుకుంటాడు. తన శక్తిని కూడా అంచనా వేసుకుంటాడు. 'హిందీ సుమాల పట్ల' (1937) అనే కవితలో ఈ క్రింది పంక్తులు నిరాలా అంతఃసంఘర్షణను, తేజోవంతులైన సమకాలికుల పట్ల నిరాలా ద్వంద్వాన్ని వ్యక్తం చేస్తాయి -

ఈర్ష్య లేదు నాకు కించిత్తు కూడా
నేనే వసంతఋతు అగ్రదూతను
బ్రాహ్మణ సమాజంలో అస్పృశ్యునిలా
నేనెప్పుడూ కవిమండలిలో పార్శ్వ ఛవినే.

నిరాలా పోరాటం 'రామ్‌కీ శక్తి - పూజ' లో రాముని సంఘర్షణ, 'తులసీదాస్' అనే దీర్ఘకవితలో తులసీదాసు పోరాటం ఎక్కడ ఏకరూపమౌతాయో, ఒకేలాంటి అనుభూతి కలగజేస్తాయో, చూడాలి. 1942లో రాసిన కవిత 'గహన్‌హై యే అంధకారా' లో తన జీవిత సార్థకతను, ఈ విలువలేని సమాజంలో నిరాలా అన్వేషించే సత్యమేమిటో, ఈ అన్వేషణలో నిరాలా ఓటమి పొందినపుడు ఆయన అనుభూతి ఏమిటో దీంట్లో వ్యక్తమవుతాయి. 'అంధకారా' అనే పదం దేశం, కాలం రెండింటి వాస్తవికతతో కూడినట్టిది.

ఈ గాఢాంధకారాగారం
స్వార్థపు ముసుగులతో
మమ్మల్ని చేశారు దోపిడీ
ప్రియా! ఇంటిని మరవాలి
దేహచేతన ఇమ్ము నాకు
వెతుకుతూ వెతుకుతూ
ఏమీ పొందక
ఓడింది నా హృది.

నిరాలా తన పోరాటాన్ని వ్యక్తం చేస్తూనే మిగతా సమాజంలో జరిగే పోరాటాన్ని కూడా పట్టించుకుంటాడు 'బేలా'లో ఇలాంటి గేయాలున్నాయి -

- నీ హృదిలో వుంది రహస్యోద్ఘాటన పాటవం
దేశానికి పెట్టుబడి నీ మిల్లుల ప్రాబల్యం

నిరాలా పెట్టుబడి వాద సమాజ వ్యవస్థ వైరుధ్యాన్ని బాగా గుర్తిస్తాడు. గొప్ప యుద్ధమే జరుగుతుంది ఈ శక్తుల మధ్య - అని పోరాట వివరాల్లోకి పోతాడు, నిరాలా. దీని సామాజిక పార్శ్వాన్ని స్పష్టం చేస్తాడు

'వెంకయ్య చెప్పిన వదంతి విన్నాను
మనవాళ్లే ఇక్కడ అజ్ఞాతంతో వున్నవాళ్లు
దేశంలో సోమరితనం ప్రబలి వుంది కనుక
వార్తా పత్రికలు వ్యాపారస్తుల ఆస్తి
రాజనీతి-క్రూరమైన రాజనీతి చలాయిస్తున్నాయి.
జనం ఇదంతా చూస్తూ
మౌనంగా వున్నారు -

ధైర్యంతో నిలబడగలిగితే వీళ్లు
త్యాగం కోసం నడుం బిగిస్తే
వాళ్లు కూడా దేశవ్యాప్తంగా బయటికి వస్తారు
పత్రికలు ఇపుడే ప్రచురించవు వాళ్ల వార్తలు
అలా వుంది కాపలా మరి ''

అందుకే నిరాలా పోరాటం ఒకేసారి ఆంతరికమూ, బాహిరమూ. దీంట్లో వాస్తవిక జీవితపోరాటం కూడా వస్తుంది ఈ పోరాటం ఇతరులతో కలిసినపుడే సార్థకమయ్యేది స్వీయసంఘర్షణానుభూతి ఇది. ప్రత్యేకమైన వింతైన అనుభూతి.

బహిష్కరించారు వాళ్లు నన్ను
ఆంతరికంగా మాత్రం నేను నిండుకుండను
పైన మంచు కరుగుతోంది
కింద నది ప్రవహిస్తోంది
కొండశిలపై మృదువైన మొగ్గ వుంది
ఇలాగే ఓడిపోతూ వచ్చాను
బహిష్కరించారు నన్ను వాళ్లు
మరో స్థాయిలో సామాజిక విప్లవం లేక పరివర్తన కోసం పిలుపు వుంది
రండి రండి కదం తొక్కుతూ
పదండి ముందుకు వేగంగా, అతివేగంగా
ధనవంతుల భవంతులీరోజు
కర్షకుల పాఠశాలలు అవుతాయి
రజకులు, మాదిగలు, బోయీలు,
వీళ్లంతా తెరుస్తారు చీకటి తాళాన్ని
ఒకపాఠం నేర్చుకుంటారు, స్వాగతించండి.
సంపదంతా దేశానికి చెందనీ
ఆపదల్ని దేశవాసులు పంచుకోనీ
వాదం నుంచి వివాదం ఆరంభమౌతుంది
ముల్లును ముల్లుతోనే తీసెయ్.

నిరాలా కవిత సామాజిక పరివర్తన కోరుతుంది. కాని ఇది బాహ్య సామాజిక

వాస్తవికత మాత్రమే కాదు. నిరాలా వ్యక్తిత్వం, పరిసరాల సంక్షిప్త గతితర్కాన్ని కూడా వ్యక్తం చేస్తుంది.

**మరణాన్ని వరించిన మనిషి :**

నిరాలా కవిత్వంలో మృత్యువుతో ముఖాముఖి చాలాసార్లు వస్తుంది దాదాపు ఆయన కవితాయాత్రలో ఇది వేర్వేరు రూపాల్లో, అర్థాల్లో జీవితపు ఓ విశిష్ట నమూనా (మోటిఫ్) లాగ వచ్చింది. మృత్యువు ఇక్కడ మృత్యువే కాదు, జీవితం కూడా మృత్యు వంటే భయం కన్పించదు, ఓ విధమైన సత్సంబంధం నిరాలా కవిత్వంలో ఈ విశిష్టానుభూతిని గుర్తించాల్సిన అవసరం వుంది.

మరణాన్ని వరించిన వాడే
నిండుజీవితం జీవించినవాడు.
బ్రహ్మవిద్య వాడిదే, వాడి బడిలోనే
సత్య యశోధర.

మృత్యువు పట్ల ఈ ఆకర్షణాభావం ''మధురస్వరం తో నీవు పిలిచావు, మరి రహస్యంగా మరణం వచ్చింది.''

ఈ గృహంలో
ఈ నాలుగ్గోడల లోపల నేనుండను

జీవితంలో వున్నాయి ఎన్నో మరణరంధ్రాలు నిరాలా కవితలో వ్యక్తమయిన మృత్యుసంబంధిత అనుభూతిని అంతఃసంఘర్షణ, స్వీయ సాక్షాత్కారాల మధ్య వుంచి చూడగలం. మృత్యువు దగ్గరైనపుడు నిరాలా రాసిన కవితలో మృత్యువు అవగాహన, జీవితపోరాటాల మధ్య ప్రగాఢ సంబంధం కన్పిస్తుంది.

నీ గెలుపు చూశాను నేను
అగ్ని అంతా ఆరిపోయింది
రాగాలాపన నిల్చిపోయింది
జీవితమిపుడు స్మృతిగా మిగిలిపోయింది
మృత్యువు నీలిరేఖ వుంది, స్పష్టంగానే.

స్మృతిలో జీవితం పోరాటమయం అని చెప్పాల్సిన పన్లేదు. జీవితంలో క్రూరమైన దెబ్బలు అనేకం చవిచూసిన తర్వాత, పరిస్థితి ఇపుడు మారింది. కవి - 'ఉత్కంఠపూరిత జీవితవిషం చల్లారిపోయింది' అని అనుభూతి చెందుతాడు.

క్రీడలు మారాయి ప్రీడలుగా, మల్లుని
దెబ్బలు మూర్ఛితమయినాయి, గురి తప్పింది
చర్మం వూగింది - డాలులా బిగుసుకుంది.

పునః ప్రాతఃకాలము : మరో ప్రదక్షిణం మనసు నిరాలా దృష్టిలో 'పునరోదయం' ఒక సార్థక అభిప్రాయం (మోటిఫ్). జీవితం మృత్యువు ఈ రెంటి ద్వంద్వంలోనే మనిషి జిజీవిష అర్థమవుతుంది. మృత్యువును అపరాధభావనతో స్వీకరించే వారూ, మృత్యువును పూజించి, ఉపాసించి దాన్ని గౌరవాన్వితం చేసేవారూ మృత్యువును, జీవిత రహస్యాలను గ్రహించలేరు. నిరాలాకు మృత్యుస్వీకరణలో సార్థకత కన్పిస్తుంది - మృత్యువు- మెల్లమెల్లగా ముందుకు వచ్చే మృత్యువు - ఒక సంశ్లిష్ట వాస్తవికత.

దట్టమైన అడవి, మార్గం వక్రం
క్రూర జంతుజాలమయం
అవతలి గట్టు కన్పించదు
అంతటా అలుముకుంటున్న అంధకారం
అంతటా ప్రసరిస్తున్న దాని జాలం
అంధకారపు గట్టిచేతికి
కష్టిపడుతుంది. శిథిల తనువు
నీరవము ఉన్మీలితము
మంద్రచరణాలు, మరణ మృదంగాలు.

మృత్యు వాస్తవికత నిరాలాను శరణాగతి తత్వానికి తీసుకుపోతుంది. కాని ఈ ప్రణతి పదావళి కూడా జీవిత పోరాటాలను తెలిపేదిగా వుంది.

పాపాల్నుంచి దూరం చెయ్ మమ్మల్ని విశ్వనాథా
ఎవరి శరణూ లేదు నాకు, చేయి అందుకో
జీవనపోరాటంలో ఓడిపోయాను
విడిచివెళ్లారు సహచరులంతా
ఒంటరితనం, నిశా క్షణాలు
ముళ్లబాట, మార్గం గడచివెళ్లాం
కరాళమోహజాలం
జీవన వ్యామోహ సర్పాల నుంచి నను
విముక్తిణ్ని చెయ్ విశ్వనాథా.

'బృహత్ జీవనసర్పం' లాంటి అనేక పంక్తులు నిరాలా జీవిత పోరాటాన్ని వ్యక్తం చేస్తాయి - కింది పంక్తుల్లో దాగి వున్న అంతర్విరుధ్యం, కావ్యాత్మక వైపరీత్యం నిరాలా మృత్యుచేతన పై వ్యాఖ్య గమనించండి.

ఆ చరణాల్లో వేడుకుంటున్నాను శరణం
ఈ జీవితాన్ని చేయాలి మరణం

నిరాలా కావ్య ప్రపంచంలో అనుభూతి వ్యాపకతకు ప్రత్యేక అర్థం వుంది. అనుభవాల వైవిధ్యం ఇక్కడ కేవలం కావ్యవిషయాల వైవిధ్యం కాదు. అనుభవ వైవిధ్యం నిరాలా కవి-వ్యక్తిత్వపు ఆంతరిక శక్తికి ప్రమాణం. పరిచిత-అపరిచిత, సామాన్య-అసామాన్య, సూక్ష్మ-విరాట్‌లను ఒకేసారి సాధించే కళ నిరాలా కావ్య జీవన అనుభవ సంపద వల్లనే సాధ్యమయింది. ప్రగాఢ విషాదానుభూతిని వినోద, వ్యంగ్య విషయాలుగా చేయడంతో దుఃఖాలు తొలగవు; వాస్తవస్థితి తీవ్ర మానసిక వత్తిడి గల పరిదృశ్యంలో వుంచుతాయి; వ్యక్తిగత, సామాజికాల మధ్య అంతరాన్ని దాదాపు రూపుమాపే నిరాలా కావ్య నివేదనా, ఆయన అనుభూతి స్వరూపాన్ని నిర్ధారిస్తుంది. సమకాలీన సమాజపు మహత్తర వాస్తవికతతో తలపడుతూ కూడా నిరాలాలో ఒంటరితనం, స్నేహరాహిత్యం తమ అనుభూతినీ, తమ అర్థాన్నీ పోగొట్టుకోలేదు అత్యంత విషాదపూరితమైన సంక్లిష్టమైన ఊహించలేని తీవ్ర అనుభవాల మధ్య, మెరుపులాంటి కాంతి పాఠకుల అనుభవం లోకి వస్తుంది. అదే ఆయన అనుభవ ప్రపంచంలోకి మరింత లోతుగా తీసుకు వెళుతుందని చెప్పవచ్చు.

# 4. నన్ను పాట పాడనీ ఈ బాధ తొలగనీ

నిరాలా వ్యక్తిత్వమూ, ఆయున ఆంతరంగిక జీవితమూ ఆయన గేయాల్లో సహజంగానే కన్పిస్తాయి. ఈ గీతాల్లో కావ్యానుభూతి, రూపు దాల్చే విధానమే కాదు మనల్ని ఆకర్షించేది, సహజత్వం కూడా మనల్ని ఆకట్టుకుంటుంది నిరాలా రాసిన అన్ని గీతాలూ ఒకే అర్థంలో సహజం కావు అనేది నిజమే చాల చోట్ల గేయాలు అర్థం కావు. అది పాఠకునికి సమస్యే. కాని నిరాలా గేయాల్లో అనుభూతి, దాని నిర్మాణ ప్రభావం ఆయన వస్తువును సమగ్రంగా, గురి తప్పనిదిగ, సహజమైనదిగ, మార్మికమైనదిగా చేస్తుంది. అర్థం కాని పంక్తులు ఆస్వాదానికి అడ్డంకి కావు. అవి ఎక్కువభాగం సంగీతాత్మకంగా వుండటం వల్లనే అర్థాన్ని సంతరించుకుంటున్నాయి. నిరాలా సంగీతాన్ని కావ్యానికీ, కావ్యాన్ని సంగీతానికీ సన్నిహితం చేసేందుకు అత్యధిక ప్రయత్నం చేశాడని ఆచార్య రామచంద్ర శుక్ల అంగీకరించారు. ముఖ్యమైన విషయమేమిటంటే. నిరాలా గీతాల సంగీతాత్మక నిర్మాణం అర్థ విశ్లేషణకు తోడ్పడుతుంది. తన గీతాల్లో వుండే విరామం అర్థాభివ్యక్తికి ఉపకరించే విధంగా చూస్తాడు నిరాలా

మౌనం మధువు కావాలి
మూగతనం చాటున భాష
సరళత్వపు వెల్లువలో మనస్సు
ప్రవహించాలి జలబిందువులా -

నిరాలా గీతాల్లో పదాల సార్థకమైన పొందికతో పాటు ఈ మౌనం కూడా అర్థవంతమవుతుంది.

నిరాలా ప్రేమగీతాల్లో ప్రగాఢ సుఖానుభూతిని చూడవచ్చు. 'సుఖ్' అనే పదం కూడా ఈ గీతాల్లో చాలాసార్లు, వస్తుంది. కాని దీని అర్థం కొంచెం వేరుగా వుంది. 'సుఖం' లాంటి చదునైన (Flat) అరిగిపోయిన బోలు పదం కూడా ఒక విలక్షణ అర్థం సంతరించు కొని వుంటుంది దీన్ని పాఠకులు సహజంగానే గమనిస్తారు

(క) ఏమీ కాలేదు, కాకుండనీ గాక
ప్రపంచ సుఖాలు అన్నీ నావే
నీవు నా దగ్గర వుంటే -

(ఖ) చేతిలో చేయివేసి
ఇలానే వుండిపోదాం
అతిశయ సుఖసాగరంలో స్నాన మాడుదాం

ప్రగాఢ ప్రేమానుభవక్షణాలు నిరాలాకు ఒక విధమైన జీవిత పరిపూర్ణత్వం సిద్ధింప చేస్తున్నాయని అన్పిస్తుంది. ప్రేమ గీతాల్లోని సౌందర్యానుభూతి నిరాలా గీతి సంవేదనలో నిబిడీకృతమై వుంది. నిరాలా గీతాల్లో రాగవిరాగాల సాహచర్యంతో కూడిన, పేరు పెట్టడానికి సాధ్యం కాని అనేక స్మృతులున్నాయి. ఈ గీతాల్లో నిష్కాపట్యము, మృదుత్వమూ వున్నాయి పదమూ అర్థమూ రెండింటికి కూడా ఇవి ఒక వినూత్న కాంతినిస్తాయి.

సుఖించిన రోజులు పోయాయా పోనీ
మనసు నువ్వు విసిగింపజేసుకోకు
తారుమారయిన స్థితి సరళమవకపోతే పోనీ
ప్రతి ఒకని పప్పు ఉడకనీ, ఉడకకపోనీ
ఈ బాణమిక ఆగదు
ఇది తెలుసుకుంటే మంచిది మరి.

ఇక్కడ గేయ వస్తువులో ఒక రకమైన తాటస్థ్యం వుంది - అనుభవాన్ని కొంచెం దూరం నుంచి, విడిగా చూడటానికి చేసే ప్రయత్నం వుంది కలయిక, కలయికతో పాటు తటస్థత - ఇదీ గేయ నిర్మాణంలోని వైశిష్ట్యం. ఛాయావాద గీతాల చరిత్రలో నవప్రస్థాన గేయమిదని అంగీకరించాల్సి వుంటుంది.

నిరాలా ప్రకృతి గీతాల్లో శాస్త్రీయ పద్ధతికి చెందిన రూపబంధం లేక పదవిన్యాసం కూడ వుంది. మృదు లయాత్మక గతికి అనుగుణంగా శబ్దార్థ సంవిధాన కూడ అమరి వుంది.

వసంత మొచ్చింది చెలీ

వృంతసహితం సరసీహృదయ కమలం పైకి రానీ / మొగ్గలో పరాగకేశాలు రాలి పడి వున్నాయి,

బంగరు పంట కొంగు
నేలది, అలయై అలరారనీ

ఈ విధమైన గీతాల్లో ప్రకృతి-అనుభూతి పరిచిత సంప్రదాయ పద్ధతికి చెందిందే. ఆకుట్టుకునే 'అక్షర-చమత్కారం' కవి యొక్క పదశిల్ప సామర్థ్యాన్ని సూచించేదిగా వుంది - దీనికి మించి లేదు. కాని, క్రింద ఇచ్చిన ఉదాహరణలో ప్రకృతి ఆకర్షణ నూతన అనుభూతి విధానంతో హుందాగా వుంది.

మబ్బులు కమ్మినాయి
నా కన్న కలలు
కళ్లలోంచి వచ్చి, తిరుగాడినాయి -
మామిడి పూచింది
తుమ్మెదలు విరుచుకు పడ్డాయి తోటల్లో
తలలు 'అబీర్'తో ఎర్రనైనాయి
చెంపలు సింధూరసిక్త మయ్యాయి
కళ్లు ఎర్రపొడితో ఎర్రబడినాయి
ఎర్రమట్టి గడ్డలు దంచినారు.

స్వీయసాక్షాత్కారం లేక ఆత్మ సంఘర్షణానుభూతి నిరాలా గీతాల్లో చెల్లాచెదురుగా వ్యాపించి వుంది. ఒక విధంగా ఈ ఆత్మ సాక్షాత్కారం నిరాలా గీతాల కేంద్రబిందువై వుంది. కాలానుగుణంగా స్వీయసాక్షాత్కారపు అనుభవాలు, అంశాలు మారుతూ వుండినాయి. కొన్నిసార్లు, నిరాలా, ఇపుడే నాకు మృత్యువు రాదు, ఇపుడే కదా జీవితంలో కొత్త వసంతం, మృదు వసంతం వచ్చింది'' అనీ అంటాడు.

నే నొంటరివాణ్ణి
గమనిస్తున్నా, నా జీవిత దినానికి

సంధ్యాసమయం ఆసన్నమయింది
స్నేహన్నిర్ఝరి ప్రవహించింది
ఇసుకలాంటి తనువు మిగిలిపోయింది
ఎండిన ఆ మామిడి కొమ్మ
అంటోంది ఇపుడింక
రావు కోయిలలూ నెమళ్ళూ
అర్థం లేని పంక్తిని నేను
జీవితం దహించుకు పోయింది -

శూన్యానుభూతిలో స్వీయవ్యథతో పాటు పూర్వపు సృజన క్షేత్ర సాధనా క్షణాల స్మృతి కూడా వ్యక్తమయింది. వాస్తవికత, మార్మికత - ఈ రెండింటి మధ్య ఘర్షణ ఫలితంగా రచింపబడిన స్వీయసంఘర్షణా గీతాల్లో నిరాలా వ్యక్తిత్వపు సంక్లిష్టత అభివ్యక్త మయింది. ఇక్కడ మధురమూ, సున్నితమూ అయిన పదావళిని అధిగమించే ప్రయత్నం జరిగింది. వక్రమైన లేక అసంబద్ధమన్పించే భాషా ప్రయోగంతో గీతాల సుపరిచితమైన అభిరుచిని మార్చడం వీలయింది.

మనిషెక్కడ పసరమో
జోడు ఏట్లా తనువు - మనసుల మధ్య?
ఏ తపస్వి వేషమిది?
ఏకస్వంతో తయారైంది ఈ చర్మం మరి
గమనిస్తున్నాడు విజ్ఞుడైన ఆధునికుడు
వన్యభావపు కొరడా ఆతను.
నా దారిన నన్ను పోనివ్వండి
ఉపద్రవాలూ, విప్లవాలూ ఎన్నో వచ్చాయి
నన్ను కిందికి దించాయి -
బొబ్బల్లా కరిగి పోనీయండి.

నిరాలా ప్రకృతి గీతాల, సమర్పణ గీతాల లయాత్మక సరళి బహుశా ఒకే విధంగా వుంటుంది. అల్ప పదబంధంలో సమర్పణాభావం, వినమ్ర ప్రతిధ్వని ఒకే రకమైన చట్రం కలిగి వున్నాయి. కాని మృత్యు చైతన్యంతో కూడిన గీతాల్లో తన్మయీభావం, ప్రత్యేక అర్థాన్ని సంతరింపజేసింది.

వేలసార్లు మరణించాను నేను
అప్పటికి లభించింది భగవత్ శరణం
అంతటా ఆలుముకున్న చీకటివల
కాల కవలితమై పోతోంది
అశ్రువులు కిరణమాలలు
వెండి ఆభరణాలు.

నిరాలా గీతాల నిర్మాణాన్ని దృష్టిలో పెట్టుకుంటే, స్వరపాత భిన్నత్వం వెనక కావ్యవివేక క్రియాశీలత కన్పిస్తుంది. బలాఘాతాల ప్రయోగం వల్ల నిరాలా అనుభూతి విశిష్ట అర్థం సంతరించుకుంటుంది. కొన్నిచోట్ల ప్రకటన ప్రబలంగా వుండాలని భావిస్తే, కొన్ని చోట్ల అల్ప కథనంతో సరళ భంగిమతో సరిపెట్టుకుంటాడు. 'బాదల్ రే! జో తడపే' - ఇక్కడ 'రే' అర్థ ధ్వని విలక్షణమైనది. 'తడప్‌నా' క్రియ ద్వారా ప్రగాఢమైన వ్యాకులత వ్యక్తమయింది. ఇందులో జానపదగేయం లాంటి నిర్మాణ సౌష్టవం కలిగిన పంక్తుల ఆకర్షణ వుండనే వుంది

కళ్ల రక్తనాళాలు మరింత ఎర్రబడ్డాయి, పాడితో హోలీ జరిపా
రాత్రి మేల్కొంది ప్రియా, సతితో రతిప్రేమ సలిపా,
దీపితమై, దీపకాంతి, కమలంతో ఆడుకుంది
రుద్దుకుంది ముఖబింబంపై కుంకుమ.

ఈ పదవిన్యాసం, సహజంగానే జానపద బాణీచే నియంత్రితం. జానపద సంగీతమే వాక్యగతిని నిర్దేశిస్తోంది. తత్సమ తద్భవ పదాల నిష్పత్తి ఎపుడు, ఎక్కడ ఎలా వుండాలి అనే విషయంలో నిరాలా అత్యంత జాగరూకత వహిస్తాడు. పదవిన్యాస వివేకం దీర్ఘ కవితల్లో వచ్చినట్లే, గీతాల్లో కూడా పదస్వరూపాన్ని స్థానభ్రంశం చేసి గీతానికి ఒక కొత్త లయను సంతరింపజేస్తాడు నిరాలా.

తెలవారింది ప్రియతమా, వెడతావు నీవిపుడు '
ఎలా వుండింది రాత్రి మిత్రమా మన కౌగిలింతల వేళ
శ్వాసకూడా విడువనీయలేదు
ఆశతో మరి వెళ్లలేదు
ఫాల్గుణ మాసం పాటలు మొదలవ్వాలా
సింధురాగం సొంపుతో

అటు ఇటు తిరిగాయి పూరేకులు
ఆకులతో పాటు అవి నాశనమవలేదు.

ఛాయావాద, ఛాయావాద అనంతర గేయ రచయితల్లా భావుకత వున్నందువల్ల తన వేదనను వ్యక్తం చేసేందుకై ఆతురత కన్పిస్తుంది. కాని నిరాలా దృష్టి ప్రత్యేకతను సంతరించుకుంది.

'నన్ను పాట పాడనీ
నా వేదన ఉపశమింపనీ' అంటాడు.

గీతాల్లో స్వీయ వ్యక్తీకరణ ఒక అవసరమైన షరతు - నిరాలా ఒకగీతంలో ఒక పూర్తి యుగం యొక్క అసంబద్ధతను ఈ విధంగా గుర్తిస్తున్నాడు. ఇది ఒక నిరాలాయే చేయగలడు.

ప్రపంచం విష భరితమైంది
పరాజితులు జనాన్ని చూసినట్లు
పరిచయం లేని
ప్రపంచాన్ని పలకరించినట్లు
అగ్నిజ్వాల కాంతిది, ఆరిపోయింది
మరలా వెలిగింది, నీరు ప్రవహించింది.
వెల్లడాయె రహస్యం / గెలిచినారసిపించిన వారు
తాగుతున్నారు ఇతరుల రక్తం

- ఇటువంటి గజళ్లు కూడా రాశాడు నిరాలా. కాని వీటిని ఉర్దూ గజళ్ల కొలబద్ధతో కాకుండా నిరాలా కావ్య దృష్టితోనే చూడాలి. తర్వాత వచ్చిన గీతాలలో నిరాలా అరాజకమైన క్రమభంగాన్ని చమత్కార పూరితంగా ప్రయోగించాడు. దీంతో కవిలోని అశాంతి వ్యక్తమయింది. 'తాక్ కర్మాసన్ వార్' లాంటి గీతాల్లో ఎంతో కొంత కొత్తదనం చూపించాలనే తాపత్రయం కూడా ఈ మనస్థితిలో భాగమే. ఒక పక్క క్రీడాభావం లేక తమాషాతత్వం - గీత విన్యాసాన్ని కూడ ఛిన్నాభిన్నం చేసేంత క్రీడాభావం, - మరో పక్క చక్కటి సంగీతాత్మక రూపం ఇస్తాడు నిరాలా - ఇలా -

ఏదీ వాయించు
సరిగమపదనిస పలికించు
రాత్రి - ఒక జాము గడిచింది
అక్కడక్కడా మృదంగ ధ్వని
మయూర కాంతి గల అవని.

నిరాలా గీతాల్లోని భిన్న లయలు మనల్ని ఆకట్టుకున్నట్లుగానే, వాటి రూపం లేక నిర్మాణ శిల్పం కూడా వెంటనే మనల్ని ప్రభావితం చేస్తుంది.

సువాసనతో చీర
పూదోటలా వుంది
రతనాల పూలు పొదిగినట్లు -
పైకి అల్లుతుంది లత
అల వెళ్ళిపోయింది.
కాల్పుల అఖాతం లోకి;
ముడుతలు పడిన దేహం
జీవితంలా
కళ్లలో దాని ప్రభావం
ఓడిపోకుండా నిలబడింది, పోరాడింది
తన చేతుల కష్టంతో
నీ కీర్తి వల్లే మేం నిద్రపోయాం
నీ కీర్తి వల్లే మేం నిద్రలేచాం
నిన్న వస్తామని చెప్పి వెళ్లినవారు
చెలి, యుగాలు దాటినా రాలేదు మరి.

నిరాలా గీతాల్లోని ఈ శిల్పం వెనుక భావుకత పై సచేతనమైన పట్టు వుందనేది స్పష్టం. నిరాలా కళావివేకం, భాషకు కొత్త అర్థాన్ని సంతరింపజేసేందుకు బాగా ఉపకరించింది 'తన వృంతం పైనే సాహితీ పుష్పం' అనే శీర్షికతో (1932) వ్యాసం రాస్తూ ఇలా అంటాడు నిరాలా.

''కావ్యాంగాల జ్ఞానం కంటే, కవికి అవగాహన ఎక్కువ అవసరం. బీజమంత్రం, దాని అర్థం, సుందర రూపం, ఆ పూవులా అర్థం అనే కాండంపై వికసించి వుంటుందో - ఏ వృంతం పై కృతికలిక పరిమళిస్తుందో - అదే భాష. భాష కూడా కాలానుగుణంగా మారుతూంటుంది. కళ వికసించే కొద్ది సాహిత్యంలో కొత్త భాష కూడా చోటుచేసుకుంటుంది. పచ్చగా, పద్ధతి ప్రకారం పెరిగిన బలమైన కాండమే కృశాంగియైన నవ్యకళకు కావాలి. కోమలమూ, కఠోరమూ, ఆత్మ, ప్రాణాల సంబంధం ఇలాగే వుంటుంది మరి.''

కోమల, కఠోరాల మధ్య - తత్సమ, తద్భవాల మధ్య నిరాలా తన గీతాల్లో సార్థక సంబంధం కల్పిస్తాడు. దీనిపై ఆయన వ్యక్తిత్వం, రచనా వివేక ప్రభావం స్పష్టం.

# 5. దీర్ఘ కవితలు : వస్తువు, శిల్పం

నిరాలా సాధించిన దాంట్లో ప్రధానంగా పేర్కొన దగ్గవి అతని దీర్ఘకవితలు. ఈ కవితల వస్తువు, శిల్పం ఛాయావాద పరిమితులను అధిగమిస్తుంది. తర్వాతి కవితలకిది ఆదర్శం. దీర్ఘ కవితలు అంటే మనకు ముక్తిబోధ్ గుర్తుకొస్తాడు. ఒక ప్రత్యేక బాణో ఆయనది. నిరాలా దీర్ఘ కవితలు ముక్తిబోధ్ మార్గాన్ని సంగమం చేశాయి. దీర్ఘ కవితల చట్రంలో ఇతివృత్తం, భావచిత్ర విధానం, నాటకీయబిగువును అందరికంటే ముందు నిరాలా ప్రయోగించాడు. ముక్తిబోధ్ దీర్ఘకవితలు ఫాంటసీ (స్వైరకల్పన) వాస్తవికతల సంక్లిష్ట సంయోజనకు ఉదాహరణలు కాని అవి ఏకరూపాత్మకాలు. నిరాలా దీర్ఘకవితల్లో శిల్పగత వైవిధ్యం వుంది. ''యమునాకే ప్రతి', 'పంచవటీ ప్రసంగ్' 'సరోజ్-స్మృతి', 'రామ్‌కీ శక్తి - పూజ', 'వనబేలా', 'తులసీదాసు', పుట్టగొడుగు' - ఈ కవితల చట్రం బహుముఖీనం కొన్ని చోట్ల ఒకే కవితాశిల్పంలో అనేక రూపాలుంటాయి. వీటిలో నాటకీయ సమతౌల్యం కూడా చూడదగ్గదిగా వుంటుంది. ఈ దీర్ఘకవితల ప్రబంధాత్మకత ప్రబంధనిర్మాణ పునరావిష్కరణ. వీటి నిర్మాణం క్లాసికల్; కాని వీటిలో కాల్పనికతకు తావుంది 'యమునాకే ప్రతి' 1922లో వచ్చిన కవిత. గతకాలపు స్మృతులతో తలపడినట్టిది సమ్మోహక సౌందర్య ఛాయతో గతకాలపు వస్తుపై పోయిన అనుభవాలతో తలపడుతుంది. యమున స్మృతి-వీణ నుంచి ఎగసిన ఝుంకారం - ఒక మార్మిక స్మృతి కథ. యమునా స్మృతి నెపంతో కృష్ణకథలోని సమస్త ఆకర్షణా వైభవం వ్యక్తం చేశాడు ఇందులో.

''అది సంవత్సరాల సహర్షక్రీడ
వీడించే చంచల ప్రపంచం

అది విలాసపు లాస్యఅంకం
అది కుటిల భృకుటి
ప్రియుని జాడ అవతలి గట్టుపై
అది చంచల యౌవన మనస్కు కడకంటి చూపు
కనురెప్ప మూయని సహజ దృష్టిలో
ప్రియుని అచంచల నిశ్వాసం

ఆలంకారిక పద్ధతిలో కథనూ, అనుభూతినీ నిర్వహిస్తూ ఈ దీర్ఘ కవిత గీతాత్మక వాతావరణం వున్న రచన తప్ప మరేమో కాదు అలంకార యుగపు వ్రజభాషా కవుల పదలాలిత్యం, పంత్‌ప్రియ ఛందస్సు - ఈ రెంటినీ పోటీగా తీసుకొని అభివ్యక్తి సంప్రదాయంలో రాసిందే తప్ప ఇదొక - నవ్య ప్రస్థానం వైపు సంకేతం కాదు. ప్రస్థాన ప్రథమ స్పష్ట సంకేతం 'పంచవటీ ప్రసంగ్'లో చూడొచ్చు. 'యమునా కే ప్రతి' కవిత ఆకారంలో దీర్ఘకవిత కాని, సార్థక ప్రక్రియగా దీర్ఘకవిత నుంచి ఆశించే నాటకీయ బిగువు, సమతౌల్యం ఇందులో లేవు

'పంచవటీ ప్రసంగ్' కవితలో ఛందస్సు, భాషే కాదు, పాత్రల పరస్పర సంబంధాల సుపరిచితమైన లేక సంప్రదాయ బద్ధమైన భావన కూడా మారింది. సీతారాముల సంబంధాల ..భివ్యక్తీకరణ ఈ కవితను ఓ రకమైన ఆధునిక నాటకంలా చేస్తుంది. దీంట్లో ముక్త ఛందస్సు, నాటకీయ ప్రయోగం వల్ల వాతావరణం గూఢార్థ భరిత మవుతూ పోతుంది. సీత తొలిపలుకుల్లో ఈ నూతన సహజత్వం లేక సరళత్వం గోచరిస్తుంది

గుర్తొస్తోంది ఆ రోజు
ప్రియతమా
మన పూదోటలో
బాల కిరణాలతో
నువ్వే నవ నీల కమలాలు
అక్కడ బందీని నేను,
ఇక్కడ నేనీనాడు ముక్త క్రీడా..ను

రాముడు ప్రేమకిచ్చిన నిర్వచనంలో వ్యుత్పత్తిపు సహజవిముక్తి ఆగుపిస్తుంది.

చిన్న ఇంటి చిరుపరిమితిలో
బంధింపబడినాయి క్షుద్రభావాలు

ఇది సత్యం ప్రియా
ప్రేమాంబుధి పొంగి పొరలుతుంది
సదా అపార పృథివి మీద -
ప్రేమవు మహోద్యమాల క్షుద్ర ఆడంబరాన్ని తెంచివేస్తుంది
అందులో సంసారుల సమస్త క్షుద్రభావనలూ
తృణప్రాయంగా కొట్టుకుపోతాయి

వైపరీత్యం ఏమిటంటే ప్రేమను గురించిన ఈ ప్రకటన యొక్క కంఠస్వరం ఐహిక ప్రపంచానుభవానికి దగ్గరిదని అన్పిస్తుంది. కవిత రెండో భాగంలో లక్ష్మణుడు ముక్తి స్థానే భక్తిని కోరుకునే ప్రకటన అత్యంత గంభీరంగా వుంది.

తుచ్ఛ వాంఛలను
వదిలివేయగలగాలి నేను
కోర్కె ఒక్కటే నాది -
భక్తి వుండు గాక అని

మూడవ భాగంలో శూర్పణఖ గర్వం, లావణ్యం, అపరిమిత కామవాంఛ, ఒకే చోట ప్రకటితమయినాయి. ఇక్కడ ఆకర్షణ ఒక కలవరాన్ని సృష్టిస్తుంది శూర్పణఖ తనను తానే రంభ, రమలను మించినదాననని ప్రకటించుకొని, వర్ణించుకుంటుంది -

కాని నాకు తెలుస్తోంది -
సృష్టియంతటి సుందర ప్రకృతి సౌందర్యాన్ని
తీసుకొచ్చి నింపాడు ఈ అవయవం నిండా విధాత

తన రూపాన్ని అతిగర్వంతో అతిశయించి చెబుతుంది అందుకే ఇది అస్వాభావికం అన్పిస్తుంది. కాని ఇది ఆమె నడవడికి పూర్తి అనుగుణంగా వుంది తన శృంగార చేష్టలను వర్ణిస్తున్న శూర్పణఖ పాత్ర నాటకీయ భంగిమను చూడాల్సిందే -

చూడు ఈ కపోత కంఠం
బాహులతలు, హస్తకమలాలు
ఉన్నత పీన స్తనాలు, క్షీణకటి, నితంబభారం
సుకుమార చరణాలు మందగమనం.

విశ్వసనీయమైన ఈ కథనం, ముందు జరగబోయే మానసిక వత్తిడికి పూర్వసంకేతం. నాల్గవ భాగంలో స్థిరత్వముంది, తర్కజ్ఞానముంది భక్తిని గురించిన వ్యాఖ్య

వుంది. అంతిమ ఘట్టానికి ముందు ఉద్దేశపూర్వకమైన మలుపు ఇది. ప్రళయం, సృష్టి, భక్తి గురించిన వ్యాఖ్యలతో పాటు శూర్పణఖ ప్రవేశిస్తుంది. ఇక్కడి నుంచే ఐదో భాగపు నాటకీయ క్షణాల సంకేతం వుంది. రాముని మాటల్లో -

భ్రమ లోపలి నుంచే
భ్రమను దాటిపోవాలి
శుద్ధచిత్తాత్మలో పుడుతుంది ప్రేమాంకురం
చిత్తం కాకపోతే నిర్మలం
వ్యర్థం ఆ ప్రేమ
మనిషిని లాక్కుపోతుందది పశుత్వం వైపు.

ప్రేమకు అర్థం చెప్పడంతో ఆరంభమయింది ఈ దీర్ఘ నాటకీయ కవిత అని పాఠకులు గమనించగలరు

ప్రథమ క్షణంలో శూర్పణఖ కూడా ఈ రాజపుత్రుల రూపాకర్షణకు లోనయింది

ఆ శ్యామల తను కమల కాంతి
ఆకర్షిస్తుంది సహజంగా
సంచిత హార్దిక ప్రేమను
స్త్రీ సహజ గుప్తధనాన్ని.

కాని ఈ సాదా ప్రతిపాదన ఒక సులభమైన బేరంలాగా కన్పిస్తుంది. నేను అందగత్తెను, నీవు నాకు యోగ్యుడవు. ఈ కవితా కథ అందరికి తెలిసిందే. నల్లత్రాచులా పొంచి వుంటానని ప్రతిజ్ఞ చేసి శూర్పణఖ అదృశ్యమవుతుంది, ముక్కు చెవులు కోయించుకొని - ఒక పరిచిత కథను పునః సృజించడంలో నిరాలా ప్రత్యేకత స్పష్టం. అయిదు భాగాల ఈ దీర్ఘ కవిత కూర్పులో నిరాలా వివేకాన్ని మనం చూడవచ్చు.

'సరోజ్-స్మృతి' నిరాలా వ్యక్తిగత విషాదం - చిన్న వయసులోనే కూతురు మృతిపట్ల ప్రగాఢమైన అనుభూతి - అభివ్యక్తమయింది. ఈ కవితా సంఘటన కాలం ముందుకు వెనక్కు వెళ్లి ఘటనల హెచ్చు తగ్గుల్ని అదుపుచేస్తుంది. ఏ అంతరాళమూ లేకుండా చేస్తుంది. దుఃఖంలో ఉద్విగ్నమైన కవి మనస్సు విరిగింది. కవిత సమగ్ర ప్రభావం మీద ఇవి పనిచేస్తుంటాయి. 19వ సంవత్సరంలో మృత్యువు కల్గించిన ఆకస్మిక ఆఘాతంతో కవిత మొదలవుతుంది.

పందొమ్మిదవ సంవత్సరంలో నీ ప్రథమ చరణం,
అది నీ జీవన సింధు తరణం
తనయా! తరుణ వయసులోనే
తండ్రి నుంచి దూరమయ్యావు నీవు
నా గీతం నీవే, రూపనామాలు త్యజించావు
అమర శాశ్వత విరామం వరించావు
సపర్యలన్నీ ముగించావు
జీవితపు అష్టాదశాధ్యాయాలు పూర్తిచేశావు
మృత్యునౌకపై, చరణమిడి
చెబుతున్నావు - 'నాన్నా, నేను వరిస్తున్నాను పూర్ణదృష్టిని
ఇది కాదు మరణం, ఇది కాదు మరణం ...

తన దగ్ధ హృదయాన్ని అత్యంత ఉదాత్త భూమికపై తీసుకెడుతూ నిరాలా మృత్యువును 'శాశ్వత విరామపు మహాగాథ' అని అంటాడు కానీ మరుక్షణమే తన వ్యర్థత, నిరాశ వ్యక్తం చేస్తాడు - గిరిశిఖరం నుంచి కింద పడినట్లు -

''ధన్యురాలా! ఈ స్వార్థ సమరంలో నేనోడిపోయానమ్మా!
నేను నీకు పనికిరాని నాన్నను
నీ కోసం ఏమీ చేయులేకపోయాను
ఈ స్వార్థసమరంలో నేనోడిపోయాను

నిరాలాకు తన జీవితపు సంఘర్షణ క్షణాలు గుర్తొస్తున్నాయి -
రెప్పవాల్చక చూస్తూ నిలబడి వుండినాను
ఆ శరక్షేపం, ఆ రణ కౌశలం

స్మృతులింకా వెనక్కి విడుతున్నాయి - 1½ ఏండ్ల చిన్నారి సరోజ, అమ్మమ్మ ఒడిలో ఆడుతూ వెరిగే సరోజ నాన్న చేయిపట్టుకొని నడిచే సరోజ - ఈ స్మృతితో తన రచనా పోరాటం ముడిపడి వుంది. జీవితపు వ్యర్థ పనిభారానికి (రచనాత్మక జీవితానికి సార్థకతనిచ్చే పనిభారం) సార్థకతనిస్తుంది

రాసేవాణ్ణి నిర్విరామంగా ముక్త ఛందస్సు
కాని సంపాదక శిరోమణులు
తిప్పి పంపేవారు సత్వరం
ముక్తసరిగా మూడుముక్కల్లో రాస్తూ ఉత్తరం.

సరోజ సుఖం చూడాలనే ఆకాంక్ష, తన రచనాత్మకతకు ఒక సమగ్ర జీవనమివ్వాలనే ఆకాంక్ష - ఈ రెండూ నిరాలాకున్న ఒకే మహత్తర ఆకాంక్షకు రెండు పార్శ్వాలు వ్యతిరేకత కూడా రెండు విధాలా సహించాల్సి వచ్చింది. సరోజ ఈడొచ్చిన పిల్ల. వివాహం చేయాలి - బాల్యావస్థకూ, యవ్వనానికీ మధ్య సంధి సమయమిది - క్లిష్ట క్షణం - రచయిత, అంటే తండ్రి, కూతురు (రచన) రూపానికి భాష ఇవ్వాలనే సకల ప్రయత్నాలు చేస్తాడు. స్మృతిలో ఒక క్షణం ఆ రూపం - క్రమంగా పూర్ణాకృతి పొందుతున్న రూపం - మొదులుతోంది -

నెమ్మదిగా అడుగు ముందుకు వేసింది
అందమైన యౌవన తీరానికి చేరింది
లావణ్య - భారంతో కంపించింది
కోమలత్వంపై, నవ్యవీణపై మాల్‌కోస్‌లా
సృష్టి సమస్త ఆకర్షణ ఈ ప్రకృతి రూపంలో ప్రత్యక్షమౌతుంది
శోభిల్లసాగింది, ప్రతి పరిచయం పిమ్మటా
శోభిల్లసాగింది అంతా
నింగీ నేలా, చెట్టూ, చేమా, ఆకులూ - చివుళ్లూ.

ఈ సౌందర్య స్మృతి అర్థమే మారుతుంది - ప్రియురాలి స్మృతి, కుమార్తె స్మృతిలో కలిసిపోతుంది - రెండు పార్శ్వాలూ ఒక దానిలో ఇంకొకటి అంతర్వ్యాప్తమయినాయి సంక్లిష్టమైన సంయమనం ద్వారా కవి ఈ సన్నివేశాన్ని నాటకీయ దృశ్యంగా మలుస్తాడు

కోరిక తొణికిసలాడుతోంది నయనాల్లో
దేహపు దివ్యకట్టడాలు చూసి
ప్రియ కంఠస్వరం పిగిలింది
తల్లి కమనీయత వ్యంజింపచేస్తూ
నా స్వర రాగిణి జ్వాలాకృతి దాల్చింది
అందమైన చూపులో
నాకు తెలియవచ్చిందా సంస్కారం?

పెళ్లయిన కొత్తలో సరోజ రూపలావణ్యం తండ్రి నిరాలాలో లోతుగా నాటుకుపోయింది. ఇలా స్మరించడంలో కూతురు ప్రియురాలి రూపంలో, ప్రియురాలు కూతురు రూపంలో మార్పుచెందినట్లు అర్థం దాగివుంది.

నీవు-నన్ను చూసి చేశావు మందహాసం
అధరాల్లో ప్రవహించింది విద్యుత్
హృదయంలో వూగింది సౌందర్యం
ప్రియుని వచన రహిత శృంగారం
అవనత నయనాల నుండి కాంతి
అధరాలను కంపింపజేసింది
నేను చూశా ఆ విగ్రహాకీవి
నా వసంతవు ప్రథమ గీతి.
ఆకసం అవని ఆయింది
నిరాకార శృంగారం
ఆయిందిపుడు రసకవితతో ఉచ్ఛ్వసితం
ప్రాణాలకు రూపరక్తిమ ఇచ్చి
రతిరూపం పొందింది
స్వర్గీయ ప్రేయసితో కలిసి పాడాను
ఆకసం ఆయింది అవని.

చక్కగా నిర్వహింపబడిన ఈ కంఠస్వరం - ఈ భాషా వైభవం ఛిన్నాభిన్నం ఆయిపోతుంది కవిత చివరిలో -

ఈ కర్మవల్లే పడుగాక పిడుగు
మతం పట్ల నిత్యం తలవంచి
నా పనులు సకలం భ్రష్టుపట్టుగాక
శీతాకాలం కమలాల్లా
బిడ్డా, గత కర్మల అర్పణం
నీకిదే చేస్తున్నా తర్పణం.

స్మృతుల్లోని సౌందర్యానుభవ రాగాత్మక సమృద్ధీ, వాస్తవంలో జీవితపు కఠోర ద్వంద్వపు నిరాశామయ స్వీకృతి-వీటి ద్వంద్వాత్మకతలోనే ఈ దీర్ఘకవిత రూపవిధానం మూర్తి మంతమవుతుంది. ఈ కవితలో నిరాలా అంతరంగిక, బాహ్య జీవన సంఘర్షణ, సరోజ స్మృతికి సంబంధించిన మానసిక ఆందోళన వ్యక్తీకరణంలో అభివ్యక్తమౌతుంది. సరోజది కేంద్రస్థానం ఆమె వలనే తండ్రి తన జీవిత పోరాటం సాగిస్తాడు. సరోజ మృత్యుసూచన నిరాలా చాలా సీదాసాదాగా, నిరావేశమైన విధంగా ఇచ్చి వుండొచ్చు. కాని

మృత్యు-అనుభూతి, లేక మానసిక అశాంతి కవిత అంతటా వ్యాపించి వుంది. అనుభూతి-భాషకు సంబంధించిన ఈ అంతస్తుల నిర్మాణంలో కవి సామర్థ్యం సంపూర్ణంగా వ్యక్తమయింది.

''రామ్ కీ శక్తి-పూజ'' అనే కవిత క్లాసికల్. అది నాటకీయ సంవిధానంలో అద్వితీయమైన కృతి. 'సరోజ-స్మృతి'ని 'రామ్ కీ శక్తి-పూజ'తో అనేక కోణాల నుంచి పోల్చిచూశారు. సరోజ-స్మృతి 1935 నాటి రచన, 'రామ్ కీ శక్తి-పూజ' 1936 నాటి రచన, అంటే దాదాపు ఒకే సమయంలో రాసిన ఒకే రకమైన కవితలు కావ్య ప్రౌఢిమను సంతరించుకొని నిరాలా కావ్య జీవన సంఘర్షణను సుపరిచితం చేస్తాయి. నిరాలా విశిష్ట కవితా దక్షతను వ్యక్తీకరిస్తుంది. మరోచోట (నిరాలా కీ కవితాఏ - మూల్యాంకన్ ఔర్ మూల్యాంకన్ - భూమిక) నేను పరిశీలించి చూసిందేమిటంటే ఒక కవితలో యుద్ధంలో ఓడిన తర్వాత అంటే - భగ్నమైన తక్షణపు భాష వుంది, రెండో దాంట్లో యుద్ధానికి మరలా సన్నద్ధమై సందేహం, సంశయం తర్వాత కూడా విజయాన్ని మరలా పొందడానికి చేసే క్రియాశీల మనస్థితికి చెందిన భాష వుంది 'సరోజ-స్మృతి' కేంద్రంలో కవి వాస్తవిక ప్రపంచపు సంక్లిష్టతతో అడపా దడపా ఢీకొనే వ్యక్తిగత ప్రపంచం వుంది; 'రామ్ కీ శక్తి-పూజ' కేంద్రంలో వాస్తవిక ప్రపంచం - వ్యక్తిగత జీవితం కఠోర పోరాటంతో నిరంతరం సమమవిస్తాయి - 'రామ్ కీ శక్తి-పూజ' ప్రారంభ పంక్తులివి -

> ''రవి అస్తమించాడు ఓ జ్యోతి పత్రంపై రాశారు
> నేటి అజేయ
> రామ రావణ సంగ్రామగాథ

దీని తర్వాత దాదాపు పదహారు పంక్తుల వంకు ఒక్క క్రియాపదం కూడా లేదు. ఇది యాదృచ్ఛికం కాదు. ఇది ఒకే ఊనిక. పూర్తి వాతావరణపు జడీభూత వాస్తవికత ప్రత్యక్షమవుతుంది. మరి ఆ క్రియ నిర్లిప్తత వైపు, భిన్నత్యం వైపు - శిథిల విషాదం వైపు - 'తిరిగి వచ్చె ఇరు సేనలు' - ఈ తిరిగి రావటంలో ఒక క్రూర వాస్తవికతతో కూడిన విషాదాత్మక అనుభూతి వుంది.

> ముందు నడుస్తున్నాడు రాఘవుడు నవనీత చరణుడు
> అలసిన వింటివారితో, అమ్ములపొదిని ఒడ్డాణంగా ధరించాడు
> జటాముకుటం విపర్యస్తం, జడలు కురులు బాహువులపై, వక్షంపై
> దుర్గను పర్వతం పై నిశాంధకారంలా దిగినాయి
> దూరంగా తారలు ప్రకాశిస్తున్నాయి అవలి గట్టు ఏదో వున్నట్లు.

ఒక అంధకారం బయట, మరొకటి లోపల; ఒక సముద్రం బయట హోరెత్తుతోంది; రెండవది లోపల ప్రశాంతంగా వుంది. మనసు ఒకసారి యుద్ధం చెయ్యడానికి తయారవుతుంది. కాని మరుక్షణమే ఈ నాటి ఘటనతో ఖిన్నుడై రావణ విజయభయంతో కంపితుడై పరాజయాన్ని అనుభూతం చేసుకుంటాడు. అపరాజిత రాముని మనస్సులో ఈ సంశయకల్పన కవితలో గాఢమైన, నాటకీయ వత్తిడి తెచ్చిపెడుతుంది. ముందు, సన్నివేశ వాస్తవికత వుంది -

అమావాస్య ఆకసం కక్కుతోంది గాఢాంధకారం
దిక్కుల ఎరుకలేదు, స్తబ్ధంగా పవనాలు
వెనుక విశాలాంబుధి గర్విస్తూ అప్రతిహతంగా
చెట్లు ధ్యాననిమగ్నం, కన్పిస్తోంది కాలుతున్న కాగడా

తర్వాత ఆంతరిక వాస్తవిక స్థితి :

నిశ్చల పురుషుడు రాఘవేంద్రుని కదిలిస్తోంది ఓ సంశయం
వుండి వుండి తనలో రాజుకుంటున్నది రావణజయ భయం.

కాని, రెండు - యథార్థాలు ఒక దానితో మరొకటి ఘర్షిస్తూనే వున్నాయి. ఈ ఆకస్మిక సంఘర్ష క్షణాన ఒక విచిత్ర ఘటన జరుగుతుంది. ప్రియురాలి సౌందర్యం ప్రధమ కలయిక మధుర స్మృతి మనస్సుతో మెరుపులా ఒక్కసారి మెరుస్తుంది. ఆ పూర్తి సందర్భం, కలయిక స్థలం, ప్రకృతిలో, ప్రకృతి వెలుపల చేష్టలు, శరీరంలోనూ, మనస్సులోనూ మెదిలే కోరికలు స్మృతిక్షణాల్లో సజీవమై నిలుస్తాయి. భాష యొక్క ఏకాగ్ర స్మృతిని స్ఫురింపజేస్తుంది.

జ్ఞప్తికొచ్చింది ఉద్యానవనం
విదేహ ఉద్యానవనం - నయనాల ప్రథమ స్నేహలతాంతరాల సమ్మేళనం
నయనాలతో నయనాల గోష్ఠ్యం - ప్రియ సంభాషణం
కనురెప్పల ప్రథమోత్థాన పతనం
కంపించే చిగురుటాకులు, రాలుతున్న పరాగం
నవజీవన పరిచయగానం చేస్తున్న విహంగ సమూహం, వలయాలుగా
    వృక్షసమూహం
జ్యోతి జలపాతం స్వర్గసమం స్వీయప్రథమఛవి
కమనీయ జానకీ నయనాలు, ప్రథమతురీయ కంపనం.

ఒక క్షణకాలంలో సీతాధ్యానమగ్నుడైన రాముని పెదవులపై మందహాసం తొణికిసలాడుతుంది, మరుక్షణంలో ప్రతిపక్షానికి ఏదో అజ్ఞాతశక్తి తోడ్పడుతోందని అందువల్ల తన బాణాలు వ్యర్థమౌతున్నాయని అనుకుంటూ రాముడు యుద్ధభూమిని గుర్తుకు తెచ్చుకుంటున్నాడు. రామునికి రావణుని క్రూర అట్టహాసం విన్పిస్తోంది. సజల భావపూర్ణ నయనాల నుంచి రెండు అశ్రుబిందువులు రాలుతున్నాయి. వాయుపుత్రుడు దీన్ని సహించలేక పోతున్నాడు. ఆతని కోపం ఎంత ఉగ్రరూపం ధరిస్తుందో ఆ భయావహ స్థితిని కవితలోని ఈ వేగమయ పదావళి ధ్వనిస్తోంది

శతఘూర్ణావర్తాలు, ఉద్విగ్న తరంగాలు, ఎగిరే పర్వతాలు
జలరాశిపై జలం ఉప్పొంగుతోంది
కట్టలు తెంచుకుంటూ, వక్షం విప్పుకుంటూ
దిగ్విజయంగా ముందుకురుకుతున్నాడు వాయుపుత్రుడు.

ఆదిశక్తి ప్రత్యక్షమై హనుమంతునికి ఆయన స్థితి, ఆయన కర్తవ్యం బోధిస్తుంది. సభలో విషాదం వ్యాపించి ఉంది 'అన్యాయమెక్కడో అక్కడికి అరుదెంచుతుంది ఆదిశక్తి' - ఇది చూసి రాముడు హతాశుడౌతాడు. తెలుసుకుంటాడు అంతా శక్తిలీల అనీ, ఆమెను పూజించనిదే ఏమీ కాదనీ. సాధన ప్రక్రియ ఆరంభమవుతుంది. ఇపుడూ ఒక అవాంతరమే అంతిమ జపం చేస్తున్నపుడు అంతిమ నీలకమలం కన్పించదు.

రాత్రి రెండవ జామున ప్రత్యక్షమయ్యింది దుర్గ
నవ్య పూజ కోసం పెట్టిన ప్రియ కమలాన్ని
తీసుకెళ్ళింది దాక్కుంటూ దాక్కుంటూ.

రాముడిపుడు దాదాపు కేకలేస్తూ అంటున్నాడు -

ఛీ - జీవితంలో ఎపుడూ పొందుతూ వస్తున్నా వ్యతిరేకత
ఎపుడూ చేస్తూ వస్తున్నా సాధన

ప్రియా జానకీ! నీకు ముక్తి కల్గించలేకపోయా. అయినా రామునిది మరో మనసుంది, నిరాశతో దిగులపడని మనసది. సీత స్మృతీ ప్రేరణతో కమలం లాంటి తన కన్నునొక దాన్ని అర్పించి తన సాధనను సఫలం చేయాలనుకుంటాడు. స్వయంగా ఆదిశక్తి ప్రత్యక్షమై రామున్ని వారిస్తూ అభయమిస్తూ అంటుంది -

''జయమవుతుంది, జయమవుతుంది నీకు పురుషోత్తమా! అని పలికి పరాశక్తి లీనమయ్యింది రాముని దేహంలో. కవితా పరిణతి పరిస్థితులపై రాముని విజయాన్ని సంకేతిస్తుంది. 'సరోజ-స్మృతి'లో ఏదో అవుతుంది అనే దానికి ఏమీ మిగలలేదు. రెండు

కవితల్లోని కావ్యానుభూతి, శిల్పాలలో వుండే భిన్నత్వాన్ని వాస్తవికతతో జోడించి కూడా చూడొచ్చు ఈ వాస్తవాన్ని అజేయ నిరాలాయే సంయోజితం చేయగలడు. వాటిలో తన చురుకైన కావ్య జీవితాన్ని భద్రంగా వుంచుకోగలడు.

నిరాలా తన దీర్ఘకవిత 'అడివిమల్లె' ని తన జీవనచరిత్ర అని పేర్కొంటాడు అతని చాలా కవితలు ఆత్మాశ్రయ ప్రధానమైనవి. కాని, వాటి వస్తువు, శిల్పాలలో వస్తుపరకత్వం స్పష్టం. ఇక్కడ ఒక కల్పనా ప్రధాన చిత్రం యధార్థ చిత్రాన్ని ఢీకొంటుంది. ఈ ప్రక్రియలో వాంఛితార్థం పొందే 'అడవిమల్లి' కవితలో 'సరోజస్మృతి', 'రామ్ కీ శక్తి పూజ'లో లాంటిదే

సంధ్యా సమయం
అంబరవీధిలో ప్రళయదృశ్యం
పీతవర్ణ అగ్నిమయ అజేయ
నిర్ధూమ నిరభ్ర దిగంతం
'సమస్త' విశ్వం భస్మీభూతం
రేగుతూన్న ధూళితో అదృశ్యమాయె ప్రాంతం
నావి నెమ్మది అడుగులు
ధర్మాసక్తుని, విరక్తుని పారదర్శనంనుంచి దృష్టి మరల్చి
నదీ తటంపై నడుస్తున్నా - ఆలోచిస్తూ, ఆలోచిస్తూ
జీవితం వ్యర్థమై పోయె,
రణరంగంలో ఓడిపోయా.

కవితలో కవి తన వాస్తవిక జీవితం, ప్రత్యేకించి సాహితీ జీవిత పోరాటానుభవాలు వెల్లడిస్తూ -

నేను కూడా
రాకుమారుణ్నైతే - ఎందుకు ఎల్లప్పుడూ పాపాలు మోస్తాను
వీరు అన్నారు - అందరూ విద్యావంతులు - అనుచరులు
నన్ను ప్రసన్నం చేసుకునేందుకు తలవంచి, చేతులు జోడించి
ఇచ్చేది నేను స్వల్పం, ఉంచుకునేది అధికం, కాని పొగుడ్తున్నాయి
పత్రికలన్నీ ఏకకంఠంతో - నా కీర్తి అమరమని

''హిందీ ప్రసూనాల గురించి'' అనే కవితలో నిరాలా తనస్థితిని గురించి ఈ విధంగా అనుభూతి చెందుతున్నాడు -

ఈర్ష్య లేదు నాకు కించిత్తు కూడా
వసంతానికి నేను అగ్రదూతనయినా
బ్రాహ్మణ సమాజంలో అస్పృశ్యునిలా
పార్శ్వశక్తిగా మిగిలిపోయా నేనిలా.

ఈ పోరాటకాలం లోని అనుభవ క్షణాల్లో రాసిన 'అడివి మల్లె' అనే కవిత నిరాలా కావ్య జీవితంలో ఎంత ప్రాముఖ్యం సంతరించుకుందో చెప్పనవసరం లేదు. కవి ఆ కవితా సందేశాన్ని అర్థం చేసుకున్నపుడు తనలో సంచిత అనుభవంలాగా, ప్రేరణ లాగా దాన్ని చూడదలచుకున్నాడు -

నేనన్నాను - ఇదే సత్యం, సుందరం
నీవు నాట్యం చేసే దానిని వృంతం పై
రాళ్లవర్షం కురుస్తున్నపుడు కూడా
కవితా !
- నా హృదయంలో అధివసించు
సౌందర్యాంతర్గత పవిత్ర సతీ శీలమా!
నాలో అధివసించు

'తులసీదాసు' అనే కవిత ప్రబంధశైలిలో రాసిన కవిత. ఇందులో తన అనుభూతిని తీవ్రంగానూ, ఉదాత్తంగానూ అభివ్యక్తం చేశాడు నిరాలా. తులసీదాసు వ్యక్తిత్వం పట్ల నిరాలా ఆకర్షణ అనేక స్థాయిల్లో వ్యక్తమయింది. నిరాలా రామకథను అనేక రచనల్లో ఉపయోగించుకున్నాడు. ఈ ఆకర్షణ తులసీదాసు కావ్య వస్తువు పట్ల నిరాలా కున్న సృ జనాత్మక సంబంధ పరిణామం. నిరాలా తులసీదాసుపై వేరు వేరు వ్యాఖ్యలు చేశాడు. తులసీదాసు సమకాలీన ప్రగాఢ చైతన్యంతో తన కృతుల్లో సాధించిన కవితా పిలువలు నిరాలాకు తెలుసు. తులసీదాసు తన కవిత్వోపకరణాలతో అంటే, భాష, ఛందస్సులతో కొత్త సంబంధం నెరపుకుంటాడు. నిరాలా దాన్ని హేతుబద్ధంగా పరిశీలిస్తాడు. తన కవితా కంఠస్వరం నిర్ధారించుకుంటాడు. క్లిష్టమైన ఛందస్సులో ఈ ప్రబంధ రచన సాగింది. ఈ ఛందస్సుకు వర్ణన, భావచిత్రాలు, భావచిత్రాలు-నాట్యగతిని సంతరించుకునే సామర్థ్యం ఉంది.

రత్నావళి కోసం తులసీదాసు అనురక్తి, రత్నావళి పుట్టింట్లో పెట్టిన చీవాట్లు, తులసీదాసు హృదయ పరివర్తనం, అనురాగం భక్తిగా మారడం-అన్నీ కలిసి తులసీదాసు సామాన్య అనుభవాలను కావ్యానుభూతి స్థాయిలో ఉదాత్తీకరణ గావిస్తాయి. ఈ కథ

తులసీదాసు జీవితగాధలో పూర్తిగా తెలిసిన వాస్తవం. కల్పన, వాస్తవికత, జ్ఞానాత్మక సంవేదన - ఈ అన్నిటితో ఒక రకమైన ఘర్షణ - సృజనాత్మక సంయోజన, లేక వ్యవస్థ రూపంలో తీసుకునే విధంగా దీనికి ఒక కావ్యాత్మక పరిదృశ్యం ఇస్తాడు నిరాలా కథా విస్తరణ ఇక్కడ మనోవైజ్ఞానికం, అరాజకం కాదు. కాలం వత్తిడి వల్ల రత్నావళి పెట్టిన చీవాట్లు అవమానంతో తులసీదాసు పొందిన ఉత్తేజకరమైన గొప్ప పెట్టుబడి -

ఒక నవ్య ఉదాత్త కావ్యభూమి యొక్క సచేతనమైన గుర్తింపు - పెనుచీకటిని చీల్చుకుని వచ్చిన సత్య సృజనాత్మక ఆవిష్కరణ ఇది -

అధిగమించాలి అంధకారాన్ని
చూడాలి సత్య సూర్యద్వారాన్ని -
భ్రమించాలి ప్రచండ జీవన సాగరతరంగాలతో

ఈ సంకల్పంతో యాత్ర ఆరంభం అయింది ఇపుడు రత్నావళి నూతన రూపం 'నవవిముక్తి' దిశగా పోవడానికి ప్రేరణ ఇచ్చింది.

మేల్కొంది మేల్కొంది ప్రబల సంస్కారం,
తక్షణం దూనమయ్యాడు కామదేవుడు
ఆమె కాదు దుర్గ, అనల ప్రతిమ
చూశాడు నీల వసన శారదను
ప్రత్యక్షమైంది సృష్టి-రశన
వరదాత్రి, జీవనసమీర విశ్వసన
దృక్కుల్లో సరస్వతిని నింపుకొని
కవి లేచి వెళ్లాడు ఊర్ధ్వ దిశగా
కేవలం ఆకసం కేసి చూస్తూ -
ఆకసం కేసి చూస్తూ

తులసీదాసే కాదు, నిరాలా కూడా తన సమస్త చైతన్యాన్నీ ప్రోది చేసుకొని ఈ ఊర్ధ్వ అనుభవలోకాన్ని ఎదుర్కొనేందుకు బయలుదేరాడు. ఉదాత్తత కోసం చేసిన ఈ ఆవిష్కరణ కావ్య నాయకునిదీ, కవిదీ కూడాను. తులసీదాసు వ్యామోహం నుంచి విముక్తి పొందలేక పోయాడు, నిరాలా కూడా విముక్తి పొందలేక పోతున్నాడు.

దేశ కాల బాణాలతో దెబ్బతిని
అశేష కాంతిమంతుడు కవి మేల్కొన్నాడు

ఇతని వాణిలో తన స్వరం నింపి
ప్రతిధ్వనించింది సరస్వతి

తులసీదాసు ఒక నూతన భాష కోసం అన్వేషించాడు నిరాలా కూడా ఇలాగే ఒక సరికొత్త భాష కొసం అన్వేషించాడు. 'ఆ భాషలో సుందర భవిష్యత్తు నిక్షిప్తమై వుంది' - అభివ్యక్తి కోసం కవి బయట ఎక్కడా చూడాల్సిన పన్లేదు - తులసీదాసు మార్గంలో పయనించిన నిరాలా తన విముక్తి - ఛందస్సులో లేదు, తనలోనే నిహితమై వుందని తెలుసుకున్నాడు.

ఏ మొగ్గలో కవి బంధింపబడినాడో
అది వికసించింది ఇపుడు
కవితా రూపంలో, నిరాశ్రయ వాసనా ఛందస్సుగా.

'పుట్టగొడుగు' అనే కవితలో (ప్రచురణ 1942) శిల్పం తులసీదాసు కావ్యశిల్పానికి విలోమం. 'తులసీదాసు'లో ఛందోవ్యవస్థ హుందాగా వుంది. తత్సమ ప్రధాన పదావళి బహు జాగ్రత్తగా రూపొందించిన శిల్ప రచనకు నిదర్శనం. 'తులసీదాసు కావ్యంలోకి ఆ ఉదాత్త కావ్య సంయోజనకు విరుద్ధంగా పుట్టగొడుగు' లో అరాజక వ్యక్తీకరణ చోటు చేసుకుంది. ఇందులో ఉర్దూ పదాలు, దేశీ పదాల కలయిక తీవ్రమైన వ్యంగ్యాన్ని వ్యక్తం చేయడానికి దోహదపడింది. ఇందులో కథాకథనశైలి వుంది -

కవిత ఒక్కసారిగా -

''అనగనగా ఒక నవాబు, పర్షియా నుంచి తెప్పించాడు గూలాబీలు''. పూలపేర్లు అసంఖ్యాకంగా పేర్కొన్నాడు - ''మల్లె (రజనీగంధ), రేరాణి, జాజి, నర్గిస్ - పుట్టగొడుగు ముందు ఎంత పెద్ద పూదోట అయినా దిగదుడుపే అని వ్యంగ్యం ధ్వనింప చేసేందుకు. రామ్‌విలాస్ శర్మ చెప్పినట్లు 'పుట్టగొడగు' లో ప్రదర్శించే దేశీయ పదాల తీవ్రత గులాబీ యొక్క పెట్టు బడిదారీ విధాన సంస్కృతి పరోపజీవి కావడం పై విరుచుకు పడుతుంది. ఈ ధోరణి అధోజగత్సహోదరులది. ఎందుకంటే అది వెంటనే తన ప్రకటనను సగర్వంగా, నేర్పరితనంతో నిండిన కంఠస్వరంతో అంటుంది ఇలా - ''నన్ను చూడు, నే పెరిగా

జానెడు పెరిగా ఎత్తుగా ఎదిగా
స్వయంభువును నేను
గింజ లేదు, లేదు గింజ నాకు

అంట్లు వేయ వీలుండదు నాకు
నా జీవితం - స్వయం ప్రజ్వలితం
నీవు నకిలీ, నేను అసలు
నీవు మేకపోతు, నేను వామాచార పరాయణున్ని
నీకు రంగు వుంది, నాదంతా శుభ్రమైన తెలుపు
నేను నీరు, నీవు నీటిబుడగ
పని నాతోనే అవుతుంది
సింహము కూడా గాడిది అవుతుంది నా ముందర

పుట్టగొడుగు తనను తాను సరసత్వంలో ఫ్రాఇడ్ అని, కేపిటల్స్‌లో లెనిన్‌గ్రాడ్ అనీ అభివర్ణించుకుంటుంది - ''నిజం తెలుసుకో, ప్రియునిలా - రచయితల్లో అదృష్టవంతులైన మూర్కుల్లా''. ఈ గర్వపర్వం చాలా పెద్దదే. ఇందులో అందరూ సమస్యాగ్రస్తులే - వాల్మీకి, వ్యాసుడు, భాసుడు, కాళిదాసు, రవీంద్రనాథ్, టి.ఎస్.ఎలియట్, రామేశ్వర్, మీనాక్షి, భువనేశ్వర్.

అందరి జనకుణ్ని నేను
స్వర్ణాభరణంలా.

రెండవభాగంలో ఒక కొత్త విషయం వచ్చి కలుస్తుంది. 'పుట్టగొడుగు' వినియోగ సంస్కృతిని సంతరించుకుంటుంది - దాని రుచికి దాసోహమంటారు - మరి నవాబు తప్పక ఈ ఆదేశం ఇవ్వాల్చి వస్తుంది - 'పెద్దతోటల్లో పుట్టగొడుగు అవశ్యం వుండాలి''.

పుట్టగొడుగు మసాలా కూర తినిపించి గొళినవాబుకూ,
నవాబ్ కూతురు బహార్‌కూ దాని విలువ తెలినేట్లు చేసింది.

'పుట్టగొడుగు' యొక్క ఈ అరాజక రూపబంధం వ్యంగ్యాత్మక కథనానికి అనుగుణంగా వుంది. చిత్రమైన అవ్యవస్థిత తత్వాలతో సంయోజితమైన ఈ దీర్ఘకవితకు కూడా ఒక క్రమశిక్షణ వుంది. 'తులసీదాసు' రచన వెనక ఎంత శ్రమ వుందో 'పుట్టగొడుగు' వెనక కూడా అంతే శ్రమ వుంది. 'పుట్టగొడుగు' కవిత శిల్పసౌందర్యం లేని రచన అని భావించకూడదు. ఈ కవితకు ఎన్నో పాఠాంతరాలున్నాయి. వీటిని బట్టి ఈ కవిత భాషా స్వరూపం పలు మార్పులకు గురయిందని వూహించవచ్చు. ఇక్కడ పేర్కొనాల్సిన అంశమేమంటే 'పుట్టగొడుగు' ప్రచురించిన ఒక సంవత్సరం తర్వాత అచ్చయిన 'తార్‌సప్తక్',

(సం. అజ్ఞేయ్) లో సంకలించిన కవితల్ని చూసి నిరాలా, హిందీ కవిత్వంలో కొత్త పోకడ వచ్చిందని భావించాడు - (రామ్‌విలాస్ శర్మ గారికి రాసిన లేఖ - 14 జూన్ 1944).

నిరాలా దీర్ఘకవితల ప్రాముఖ్యం వస్తువు దృష్టితో చూసినా వుంది. శిల్పం లేక టెక్నిక్ దృష్టితో చూసినా కూడా వుంది. ఈ కవితలు, ముందే చెప్పినట్లు ఛాయావాదాన్ని అధిగమిస్తాయి. ఛాయావాదం లేక కాల్పనికవాదం, వాస్తవికతావాదాల మధ్య వుండే ఘర్షణలో నూతన కావ్యరూపాన్ని సంతరించుకుంటున్నాయి ఇవి. వీటిలో ఆకట్టుకునే జీవితపోరాట పార్శ్వాలున్నాయి. బాహ్య ప్రపంచంలో సంభవించే సరిస్థితుల సూక్ష్మ ప్రతిఫలనం కూడా కలిసి వుంది. అందువల్లే ఈ కవితలు ప్రాముఖ్యం సంతరించుకున్నాయి.

# 6. కవితా వాస్తవికత : వాస్తవికత యొక్క వ్యంగ్యాత్మక పరిణతి

ఒక పక్క నిరాలా వాస్తవ చిత్రణకు అవసరమైన ప్రాధాన్యం ఇస్తాడు, మరో పక్క యుధార్థ అనుభూతిని వ్యంగ్యాత్మక పరిణతి వరకు తీసుకెళ్తాడు. యధార్థ చిత్రణ పట్ల నిరాలా జాగ్రత్త పడటం ఆతని ప్రారంభ రచనల్లో చూడవచ్చు - కురూప వాస్తవికత లేక వ్యంగ్యం వైపు ఆయన మొగ్గు 'పుట్టగొడుగు', 'మల్లె', 'కొంజిగళ్లు' రాసే కాలంలో ప్రత్యేకించి కన్పిస్తుంది. 'రాళ్లు కొట్టే ఆమె', 'మోడు'లాంటి రచనలు వాస్తవ చిత్రణ దృష్టితో చూస్తే ఉదాహరింపతగినవి. వీటిలో చిత్రణ యధా తధంగాను వస్తుపరకంగానూ, సూటిగానూ వుంది. చూసిన ఘటనల పట్ల అనుభవాల పట్ల ఒక తటస్థ ప్రతిక్రియ వ్యక్తం చేస్తూ కూడా నిరాలా తన సంవేదనాత్మకమైన పట్టింపును పోగొట్టుకోలేదు. 'రాళ్లు కొట్టే ఆమె' కవిత వాస్తవికతావాద కవిత. కళకు గీటురాళ్లు అనబడే ఆతని కవితల్లో అత్యంత ప్రముఖమైన కవిత ఇది. ఈ కవితలో స్పష్టత, అర్ధ గాంభీర్యం గురించి నిరాల ఎంత జాగ్రత్త తీసుకున్నారో ఆయన 1937లో జానకీవల్లభశాస్త్రి గారికి రాసిన ఒక లేఖ ద్వారా బోధపడుతుంది.

నీడ నిచ్చే<br>
చెట్టు కాదది దాని కిందే కూచుని<br>
నల్లని ఆ యువతి<br>
నతనయన, మనసునిల్పి పనిచేస్తోంది

పెద్ద సమ్మెట చేతిలో, కొడుతోంది, కొడుతోంది
ఎదురుగా చెట్ల వరసలు, మేడలు, ప్రాకారాలు.
– 'రాళ్లు కొట్టే ఆమె'.

నిరాలా దృష్టిలో వాస్తవికతావాద చిత్రణ సరళమైన కళేమో కాదు శాస్త్రిగారికి రాసిన లేఖలో నిరాలా అంటాడు - ''ఇచట వర్ణన సీదాసాదాగా వున్నప్పటికీ గొడ్డలి వేటు రాయిపై పడుతున్నప్పటికీ, కాస్త ఆలోచిస్తే, అది మేడపై పడుతోంది. రచయిత వర్ణించిన తీరువల్లా, దాని నిర్దేశం మల్లా 'నేను రాళ్లు కొడుతున్నా'' - కవిత చివరిలో నిరాలా ఇలా వ్యాఖ్యానిస్తాడు - నేను రాతి గుండెను కొడుతున్నాను '' కవితా వాస్తవాన్ని సంఘటిత పరిచే కళ తక్కువ ప్రాముఖ్యం కలది కాదు

ముందున్న మామూలు రాయిపై పడే అదే గొడ్డలి వేటు, రెండొసారి మేడపై, తర్వాత రాళ్లు కొట్టే ఆమె గుండెపై పడుతుంది. ఇక్కడ ''రాళ్లు కొడుతున్న ఆమె'', ''మోడు'' లాంటి కవితల వరకు వచ్చి నిరాలా రవీంద్రనాథ్ లాంటి కవుల పరిమితులు అర్థం చేసుకో సాగాడు - తన సమకాలీన ఆధునిక దృష్టికి టాగూరు బహుదూరం అని భావించాడు నిరాలా

'మోడు' సరళమైన కవిత ఈ సరళత్వం వాస్తవ ప్రకృతి అనుభవాన్ని తీక్ష్ణమైనదే కాని ప్రశాంత ప్రభావాన్ని నెరపుతుంది.

ఎండిన మోడు ఇది నేడు !
కళావిహీనం
అలంకరణ అంతా ఆయింది మాయం !
ఇపుడిది వసంతం వస్తే అధైర్యపడదు
పల్లవితమై ధనస్సులా వంగదు
మన్మథుని పూబాణాలు పడటం లేదు
బాటసారులు రారు నీడలేదు కనుక
ప్రేమజంటల కన్నీరు కార దిక్కడ
కేవలం ఒక వృద్ధ విహంగం ఏదో తలచుకుంటూ
కూచుంటున్నది దీనిపై !

ఈ కంఠస్వరం నిరాలా 1940 దరిదాపుల్లో గత వైభవ సంస్మరణతో రాసిన కవితల్లో కూడ కన్పిస్తుంది.

కవితా వాస్తవికత . వాస్తవికత యొక్క వ్యంగ్యాత్మక పరిణతి

'స్నేహపు సెలయేరు ప్రవహించిపోయింది
ఇసుకలాంటి తనువు మిగిలిపోయింది
మామిడి కొమ్మ - ఎండిన మామిడి కొమ్మ అంటోంది - ''
ఇపుడిక్కడికి నెమళ్లూ కోయిలలూ ఏవీ రావు మరి

ఈ కవితల్లో కూడా నిరాలా వ్యక్తిగత, సామాజిక అనుభవాల ద్వైతాన్ని దాదాపు రూపుమాపుతాడు. అందువల్ల ఈ శూన్యత నిరాలా నిజజీవితం నుంచే రూపు దిద్దుకుంది, అని అనుకుంటే జాతి జీవితపు ఓటమి వాస్తవానుభూతిని (నిరాలా కవిత్వంపై దీని అనివార్య ముద్ర వుంది) సరిగా అర్థం చేసుకోలేం.

వ్యంగ్యం ప్రధానమైన చోట సంవేదనాత్మకత పక్కదారి పట్టే ప్రమాదం వుంది మరో ప్రమాదం ఏమంటే, వ్యంగ్యార్థం, వ్యంగ్య విలువ, అరాజక వాస్తవికతావాదానికి వూతమిన్యసాగాయి నిరాలా నిబద్ధత ఈ ప్రమాదకర అరాజకత్వాన్ని నియంత్రిస్తుంది అందువల్ల విరూప వ్యంగ్య ప్రయోజనం నిరాలాకు స్పష్టం. నిరాలాను మరొక విషయానికి అభినందించవచ్చు. అదేమిటంటే ఆధునిక హిందీ కవితలో మొదటిసారిగా నిరాలా వ్యంగ్యాన్ని కరుణతో మేళవించి వాస్తవికతావాద కవితారూపానికి నూతన స్వరూపం ప్రదానం చేశాడు నిరాలాను ప్రప్రథమ ప్రయోగశీలి అనడంలో ఔచిత్యముంది. ఛాయావాద కవిత్వపు ప్రధాన లక్షణం సౌందర్యాత్మక గేయశీలత అయిన దశలో కూడా నిరాలాకు వాస్తవికతావాద అవగాహన, దాని ప్రయోజనమూ తెలుసు కావ్యగీత నవ్యత్వ ప్రథమ ఆవిష్కర్త నిరాలా - ఆధునిక ఖడీబోలీ కవితా చక్రానికి సంబంధించినంత వరకు. ఈ నవ్యత వెనుక వాస్తవికతావాద నేపథ్యం స్పష్టం.

ఛాయావాద కవితను ప్రేమ, సౌందర్య అనుభూతికి సంబంధించిన సుకుమారమైన అభివ్యక్తి అని చెప్పుకోవచ్చు. సూక్ష్మ కల్పన సౌందర్యాన్ని బహుశ అశారీరికం చేస్తుంది ప్రేమ యొక్క ఉదాత్తత నైతిక ఉన్నతికి సంకేతం కావ్యాభిరుచికి చెందిన ఈ ప్రత్యేకత వాస్తవికతా అభివర్గపు విశాల అనుభవ ప్రపంచాన్ని బహిష్కరించినట్లు అన్పిస్తుంది నిరాలా కవిత్వం వాస్తవికతావాదానికి వికృతి అని రామ్‌విలాస్ శర్మ అంటారు. కాని, నా కన్పించేదేమంటే, అది ప్రేమ, సౌందర్యాల వర్గ అభిరుచి ఆధారంగా రూపొందిన భావకవితా కల్పనకు (రోమాంటిక్) విరుద్ధంగా విజృంభించిన ప్రతిక్రియ అని

బాపన పిల్లోన్ని నేను
అందరినీ ప్రేమిస్తాను
నీళ్ళు తెచ్చే ఆమె

తెలవారు జామునే వస్తుంది
ఆమె అంటే మరి
పడి చస్తా నేను.

ఇక్కడ 'బాపన పిల్లోడు' అని నిరాలా ద్విజవర్ణ దర్పంపై దెబ్బ తీస్తాడు. ప్రేమ్‌చంద్ కథానికలు, నవలలూ ప్రతిపాదించేనగ్న వాస్తవికతా దృశ్యాల్నే నిరాలా కవితలు మన ముందు ప్రత్యక్షీకరింపజేస్తాయి. 'గరమ్ పకోడి' అనే కవితలో నిరాలా మరి ఈ రకం వ్యంగ్యాత్మక వాస్తవికతనే మన ముందుకు తెస్తారు -

వేడి పకోడీ - ఓ వేడి పకోడీ -
మొదట నువ్వు నన్నాకర్షించావు :
నా హృదయం దొంగిలించి గుడ్డలా దాన్ని పిండావు
ఓ పకోడీ, నేను నీ కోసం త్యజించా
బాపనోడు వండిన
నెయ్యితో తయారైన పూరీలెన్నో -

'బాపనోడు వండిన' - అనే పదజాలంపై అధికమైన వూనిక ఇవ్వడం వల్ల ద్విజ సంస్కృతి పై జాగ్రత్తతో కూడిన ఒకతీవ్రమైన ప్రతిక్రియను వెల్లడించాడు నిరాలా

'పుట్టగొడుగు' అనే సుదీర్ఘ కవిత ఈ వర్ణప్రధాన సామాజిక చట్రానికి వ్యతిరేకంగా వచ్చిన కవి స్పందన దీని అంతర్నిర్మాణాన్ని అరాజక గందరగోళం అని గమనించవచ్చు ఈ కవిత రూపవిధానంలో వస్తువు, శిల్పానికి సంబంధించిన ఛాయావాద అనుభూతి, భాషలను నిర్ధారించే అభిజాత్యం నుంచి విముక్తిని చూడవచ్చు. ఈ కవితలో వర్ణించిన గులాబీ, పుట్టగొడుగుల మధ్య గల వైరుధ్యం సచేతన వర్గతత్వం పై ఆధారపడి వుంది. సుసంగతమైన మార్క్సువాదం కాకపోయినా, ఈ ప్రతీకాత్మక సంబంధపు పరికల్పనలో భూస్వామ్యవిధానం పీడితవర్గాల మధ్య చెలరేగే ఘర్షణ 'దాచేస్తే దాగని సత్యం'. సంస్కారపరంగా వసంతం వర్గ అభిరుచీ, నవాబు అభిరుచిల్లో వచ్చిన ఆకస్మిక మార్పును మనం అంగీకరించలేకపోవచ్చు అనేది వేరే విషయం. సౌందర్యాభిరుచిలో వచ్చిన మార్పు గురించే కాదు, వినియోగ వస్తు - అభిరుచి ని గురించి కూడా మనం తెలుసుకుంటేనే, ముందు పేర్కొన్న ఘర్షణను సరిగా అవగాహన చేసుకోగలుగుతాము. భూ స్వామ్యవిధానం (Feudalism), వినియోగ సంస్కృతుల మధ్య వుండే సంబంధాన్ని నిరాలా చూడగలుగుతాడు. ఇది తక్కువ ప్రాముఖ్యం గల విషయం కాదు పుట్టగొడుగు తర్కం ఉద్దేశం సౌందర్యం, విలువ - ఈ రెండు దృక్కోణాల నుండి తనతో గుర్తింపు

సాధించుకోవాలనే ఆకాంక్ష -

> మరి నేను నా నుంచే జన్మించా
> విత్తనాలు లేవు నాకు
> అంటు కూడా కట్టలేదు నాకు
> జాగృతియే నా జీవితం
> నేనే సాధించావని
> సింహము కూడా నా ముందు గార్దభమే మరి
> నన్ను చూసే చేశారు చీనా దేశంలో గొడుగు
> భరత దేశపు గొడుగు అది చూడు
> అంతటా ఇపుడది పారాచూట్ రూపం ధరించింది.

బహారీతో గోలీ పుట్టగొడగు మసాలా కూర రుచిని పొగుడుతూ అంటుంది - 'నిజం తెలుసుకో నూనెతో వేయించిన ఈ కబాబు, మనుషుల్లో రాజులా.' ఇలా అంటున్నపుడు నవాబు అభిజాత్యం ఆతన్ని భయపెట్టదు. కాని బహారీ ప్రభావిత మౌతుంది పుట్టగొడుగు రూపుతో కాదు, దీని ప్రయోజనంతో ఒక కొత్త సన్నివేశంలా ఆకస్మాత్తుగా పుట్టగొడుగు వినియోగవిలువ పెరిగింది

చివరికి నవాబు కూడా ఇదే వినియోగ పిలువకు బెదిరి పుట్టగొడుగు పండించాలనే ప్రతిపాదన చేస్తాడు అపుడు తోటమాలి ఇచ్చిన జవాబు ఒక వ్యంగ్య బాణం భూస్వామ్యవాదానికి వేళ్లు లేవనీ, అది ఒక పరోపజీవి వర్గమనీ, వినియోగవాద సంస్కృతితో వెనవేసుకొని స్వకేంద్రితమైందనే వాస్తవికతను వ్యక్తీకరించడం లక్ష్యం

> "కోపమొచ్చింది, పణకసాగాడు నవాబు
> అన్నాడు - 'గులాబ్ నువ్విక వాపసు వెళ్ళు
> వచ్చిన చోటికి, మా అందరి ఇష్టం ఇపుడు పుట్టగొడుగు"
> తోటమాలి అన్నాడు - అపరాధం మన్నించండి ఇపుడు
> పుట్టగొడుగు పండించినా పండదు మరి"

వ్యంగ్యార్థం ఒకేసారి పలు స్థాయిల్లో స్పష్టంగా వుండటం ఈ కవిత ప్రత్యేకత. ఈ వ్యంగ్యం నుంచి ఎవరూ తప్పించుకోలేరు. ఆఖరికి పుట్టగొడుగు కూడా (కవితాచక్రం పూర్తిగా పుట్టగొడుగు కోసమే అయినా)

బోర్లిస్తే, నేనవుతాను కప్పాన్ని
నన్ను వంచి ముందుకు తీసుకొస్తే
నా నేర్పు చూడు
రాముని ధనుస్సును నేను
బలరాముని భుజస్కంధంపై వున్న నాగలిని నేను
కర్రకు కట్టిన కొంగును నేనే
ప్రపంచమంతా ధాన్యం కొలత నిర్ధారించేది నేనే.

ఈ వ్యంగ్యం చాలా దూరం పోతుంది దీని పరిధిలో లెనిన్‌గ్రాడ్ కూడా వస్తుంది, రచయిత కూడా వస్తాడు.

నిరాలా కవిత ''రాణీ ఔర్ కొన్'' లో కురూప వాస్తవికత యొక్క వ్యంగ్యాత్మక విషాదాంతం ఆధునిక పాఠకుని పై సరికొత్త ప్రభావం కలగజేస్తుంది. తర్వాతి కవుల్లో నాగార్జున్ ఇలాంటి ప్రకటనాత్మక కవితా సృజన సందర్భంగా తప్పక గుర్తొస్తారు.

స్త్రీ జాతి రత్నం ఆమె
వివాహమెలా అవుతుంది
మరి, ఒంటికంటిది ఆమె
విని ఆమె హృదయం కంపించింది
సర్వాంగాలూ కంపించాయి
కుడి కన్ను నుంచి కారాయి కన్నీళ్లు
మాతృమూర్తి దుఃఖంతో
కాని, ఎడమ కన్ను
వుండిపోయింది
వున్నదివున్నట్లే.

మన సమాజంలో స్త్రీలు ఇప్పటికీ పీడితుల కిందనే లెక్క పురుషాధిక్య సమాజంలో అందవిహీనుడైన పురుషునికి వివాహసమస్య వుండదు కాని కురూపియైన స్త్రీకి, ఇది సమస్య. ఇది మన సమాజ భయంకర వాస్తవం - 'స్త్రీజాతి' అని అలాంటివారినే మనకు గుర్తుచేస్తాడు నిరాలా. 'కంపించాయి సర్వాంగాలూ' అని అనడంలో అస్తిత్వపు పూర్తి వత్తిడి వ్యక్తమవుతుంది. పేదరికపు సహజచిత్రణ కూడా నిరాలా వాస్తవికతావాద పద్ధతిలో అందంగా చేస్తాడు.

మా యింటికి పడమటి దిక్కున
వుంటోందొక యువతి పెద్ద పెద్ద కళ్లు ఆమెవి
పేదింటి పిల్ల ఆమె
సొమ్ములతో అలంకరించినట్లు
యౌవనం పొటమరిస్తోంది
వాద్యం పై గమకం పలుకుతున్నట్లు.

ఇక్కడ వర్ణన సహజం - సౌందర్య ప్రసక్తి ఇక్కడా వుంది, కాని ఆ సంచలనం లేదు - రూపదీప్తి వుంది కాని ఉత్తేజన లేదు, కాని 'గొంగళిపురుగు' కవిత రాసే నిరాలా రవీంద్రనాథ్ఠాకూర్ రాసిన 'బిజయిని' కి పేరడీగా రాసినా, స్త్రీకి ఇవ్వాల్సిన సహానుభూతిని ఇవ్వలేకపోయాడు నిరాలా. ఇది వ్యంగ్యానికి మాత్రమే పరిమితమైన కవిత. ఇందులో అశ్లీలత లేదు, వికృతి వుంది.

మనసును సుఖపెట్టేందుకు ఇపుడు
స్నాన మాడాలని ఆ అత్త ఆ తోటలోని చెరువులోకి
పగలు, సాయంకాలం ఎండ పసిమిరంగుకు మారిన వేళ
గ్రామమంతా స్వర్ణకాంతి,
మట్టితో కూడిన పాలలో - వున్నాయి నీళ్లు
సంతసం పట్టలేక ఆ అత్త స్నానం చేయ నిశ్చయించి
నీటిలో దిగింది రవీంద్రుని 'బిజయిని' లా -
ఆడఏనుగు ఆమె హృదిలో ప్రవేశించినట్లుంది
కంపించసాగింది నీరు, భయంతో.

ప్రకటన పరిణామం ఏమిటింటే, అత్తకు గొంగళిపురుగు అంటుకుంది. 'ఏ అంగమూ మిగల లేదు' అంటూ పరిగెత్తి పోయింది అత్త. నిరాలా ఓ రకమైన ఆనందం అనుభవిస్తున్నట్టుంది ఈ దృశ్యం చూసి. బాధపడుతోంటే ఆనందాన్ని అనుభవించే ఈ మానసికత వెనుక గల మనోవైజ్ఞానిక గ్రంథిని వేరేచోట కూడా చూడగలం 'స్ఫటికశిల'లో కవితా వాస్తవికత వుంది. ఇందులో స్త్రీ శరీరం పట్ల ఆకర్షణ ఒక సమస్యగా, ఒక సంకటంగా మన ముందుకొస్తుంది. ఈ ఉదాత్తీకరణ కోసం ఆత్మగ్లానిని ఆసరాగా తీసుకోవాల్సి వస్తుంది.

నుంచొని నేను అద్దంలోకి చూస్తున్నాను
యువతిపై చూపు నిల్చింది. సద్యఃస్నాత ఆ యువతి
తడిసిన చీరలో అందంగా అలరారుతూ
బలిసిన స్తన ద్వయం మనసుకు కష్టం కల్గిస్తూ
వృత్తాకార వక్షోజాలపై దృష్టి నిలిచింది
జయంతుని ముక్కులా ఏ కోరికా లేదు
చూడాలని మరింతగా
ఆ దివ్యస్తనాల్లో ఎంత కాఠిన్యం
నా శరీరం వణికింది, జానకి గుర్తొచ్చింది
నీవు రామునికి
ఎలా దర్శనమిచ్చావమ్మా

సౌందర్య తత్వశాస్త్రపు ఈ Anti Climax భ్రాంతి, భ్రాంతిభంగము-వీటి ఘర్షణను మన ముందుకు తెస్తుంది. దీని వ్యాఖ్య ఆసక్తి కరంగా వుండగలదు.

'అణిమ', 'బేలా', 'నయేపత్తే'లో వాస్తవచిత్రణ వుంది. అది కేవలం దృశ్య-తథ్య చర్చ అని భావించాల్సి వుంటుంది. దీనితోపాటు వీటిలో ఒక పూర్తి సామాజిక సన్నివేశాన్ని వ్యక్తీకరించే విధంగా సాగే వాస్తవ చిత్రణ యొక్క రాజకీయ ప్రయోజనం కూడా చూడొచ్చు. రెండో రకం ఉదాహరణల్లో భారతీయ సమాజమూ, రాజనీతి సంశ్లిష్ట, అంతర్వైరుధ్యాల ఎరుక నిరాలాకుండేదని భావించవచ్చు. శుష్కం అన్పించే వాస్తవచిత్రణ, వ్యంగ్యం స్థాయిలో భాష కూడ సామాజిక వాస్తవికతను తెలిపే ఒక సంకేతం.

కొమ్మల్నుంచి ఆగి ఆగి రాస్తాపై
పడుతున్నాయి కిరణాలు.
రైతు కుడివైపు పొలంలో
భుజంభుజం కలిపి పోతున్నాడు ముందుకు
ఎడమవైపు కూర్చున్నాయి పక్షులు కొన్ని
దిరిసెన వేళ్లు మెలిపడి వున్నాయి.

దీనికి భిన్నంగా 'కీచురాయి నిలబడి అన్నది నిర్భయంగా' అనే కవితలో వర్గ పోరాట చైతన్యం రాజకీయ అర్థాన్ని సంతరించుకుంది దోపిడీ వ్యవస్థకు వ్యతిరేకంగా కీచురాయి చేసిన సాహసం ఒక సంకేతం - సమాజ వ్యవస్థ కిటుకును అర్థం చేసుకునేందుకు, చెప్పేందుకు కావల్సిన సాహసం - ఇక వర్గపోరాట ప్రక్రియను ఆపలేరు అనేందుకు సంకేతం.

కిసాన్ సభ సోదరునికి
మేం చేశాం సాయం
మాపై కాల్పులు జరిపించాడు జమీందారు
పోలీసోళ్లు వాళ్ల ఆజ్ఞను శిరసావహించారు
అసలు కిటుకు అక్కడుంది మరి.

నిరాలాకు తెలుసు మనవాళ్లు 'రహస్యజీవితం' గడిపే వాళ్లు మున్ముందు తీవ్రతరం అయ్యే పోరాటంలో వీరి పాత్ర ఎంతో వుంటుంది. కాని ప్రస్తుతానికి వీళ్లలో జాగృతి కన్పించదు - ఎందుకంటే -

ఇంకా ప్రబలంగానే వుంది సోమరితనం దేశంలో
పత్రికలు వ్యాపారుల ఆస్తిగానే వున్నాయి
రాజకీయాలు మొరటుగానే సాగుతున్నాయి.

ప్రేంచంద్ సమాజంలో జరిగే తీవ్ర వర్గపోరాటాన్ని ఏ విధంగా చూస్తూ వచ్చారో నిరాలా కూడా దీనిపై దృష్టి సారించాడు. 'మల్లై' అనే కవితలోని గజళ్లు నిరాలా వాస్తవికతావాద అవగాహనకూ రాజకీయ చైతన్యానికీ నిదర్శనాలు -

వాళ్లు మాకు పరాయి వాళ్లయిపోతున్నారు
చూసేందుకు కన్పించి పోతున్నారు
తెలిసింది రహస్యం; గెల్చిన వాళ్లు
మా రక్తం తాగి పోతున్నారు
ఆర్థిక వ్యవస్థను ఆవహించిన సంక్షోభం రాజకీయ పరిస్థితే.
బయట పెడతాం రహస్యం - మాకా ధైర్యముంది
దేశానికి చెందిన సంపత్తి మీ మిల్లుల్లో వుంది

'కజలీ' అనే జానపద గేయ బాణీని కొంచెం మార్చి అధికధరల లాంటి ఆర్థిక సమస్యల పై వ్యాఖ్యానిస్తాడు నిరాలా. భారతేందు ప్రజా సమస్యల్ని తన కవితా మాధ్యమం ద్వారా స్పష్టంగా ఎలా ప్రస్తావించాడో, అలాంటి స్పష్టత, తీవ్రత, నిరాలా కవిత లోని కింది పంక్తుల్లో ఇలా వ్యక్తమయింది.

నల్లనల్లని మబ్బులావరించినాయి, వీర జవాహర్ రాలేదింకా
ధరలు ఆకాశాన్నంటాయి, సంపాదన సర్వం దీనికే సరిపోతుంది
ఆకలి గొన్నవాళ్లు, అర్ధనగ్న దేహాల వాళ్లు సిగ్గుతో
దిగులుగా వున్నారు వీర జవాహర్ రాలేదు మరి

నిరాలాకు ప్రజలంటే ఏమిటో తెలుసు. వాళ్ల కష్టాల్ని, పోరాటాల్ని వాస్తవిక దృష్టితో చిత్రించాల్సిన బాధ్యత ఆయన్నపై వుంది ఆయన మాటల్లో - 'పల్లెల్లో అధిక జనం కూలీలు లేక రైతులుగా వున్నారు' నిరాలాకు తెలుసు సామాజిక వర్గం వెత్తనం పరిసమాప్తమౌతుందని. అంటే ''గొప్ప గొప్పవాళ్లు ధనమూ, మిథ్యాభిమానమూ త్యజిస్తారని''.

నిరాలా కవిత్వపు వాస్తవికతావాదం ఒక సంపూర్ణ యుగ సామాజిక పోరాటాన్ని చూపెడుతుంది. ఈ వాస్తవ చిత్రణలో నిరాలా మొగ్గు ఎటువైపో చూడకుండా వుండలేం సామ్యవాదం వస్తూనే ప్రజల సకల కష్టాలూ పోతాయనే భ్రమ నిరాలాకు లేదు వాస్తవిక సామ్యవాదం దాని క్రమంలో అది వస్తుంది. చాల సార్లు అది కేవలం బుద్ధిజీవుల రాజకీయం (పాలిటెక్స్-) గానే వుండి పోతుంది. 'మాస్కో డయోలాగ్స్'లో గిడ్వాని గారు బౌద్ధిక సామ్యవాది. కాని సమాజానికి మేలు చెయ్యాలి, అన్నగారికి బంగ్లా కట్టించాలి - పాపం ఈ రెంటి మధ్య దేనికి ప్రాధాన్యం ఇవ్వాలో నిశ్చయించుకోలేక పోయాడు.

ప్రాధాన్యం సంతరించుకున్న యుగంలో, సామాజిక పరివర్తనలో, తన పాత్ర నిర్వహిస్తూనే, నిరాలా ఒక గొప్ప సాహితీ పరివర్తన తన రచనల్లోనే సాధించగలిగాడు. నయే పత్తే' భూమికలో భాషకు సరికొత్త మెరుగులు దిద్దడం తన లక్ష్యం అని చెప్పడంలో నిరాలా నిజంగానే సామాజిక వాస్తవికతకు సరికొత్త రూపురేఖలు స్పష్టం చేసినట్లయింది. మయకోదిస్కీ తీవ్ర ప్రయోగశీలతను గురించి ఏ విధంగా చర్చిస్తామో, వాస్తవికతా సవాలును స్వీకరిస్తూ నిరాలా కూడ అలాంటి అతి ప్రయోగశీలతను ప్రదర్శిస్తాడు. నిరాలా అనేక వాస్తవికతావాద రీతుల్ని ప్రయోగించి ఆధునిక కవితా పరిధిని విస్తృతం చేశాడు. 'సంకోచించను, కడు విస్తృతమౌతాన్నేను' - విస్తృతినిచ్చే ఈ కవిత వాస్తవికతా పునాదులతో ముడిపడి నట్టిది.

నిరాలా కవితా దృక్పథం 1940 దరిదాపుల్లో చాలా మారిందని అనిపిస్తుంది. దీని వెనుక మొత్తం ప్రపంచమంతటా సాగిన సామాజిక విప్లవ పరివర్తనా చైతన్యం వుంది. నిరాలా కొన్ని మౌలిక సామాజిక సమస్యల అవగాహన ఆధారంగా ఈ మహత్తర వాస్తవ చైతన్యాన్ని గ్రహించగలిగాడు. పంత్ కావ్య ప్రపంచంలో ఇటువంటి పరివర్తన ఒక్కసారిగా ఆకస్మికంగా వస్తుంది, ఆ తర్వాత అది అలాగే అదృశ్యం అవుతుంది కూడా. నిరాలాలో అది చారిత్రిక పరిస్థితుల అవగాహనతో సాధ్యమైంది; ఏదో ఒక రూపంలో దృశ్యపటలంపై ముద్ర వేస్తూనే ఉంటుంది. ప్రేమ గీతాలు, ప్రార్ధనా గీతాలు కూడా సామాజిక వాస్తవికతతో ఒక తీవ్ర ద్వంద్వాత్మక సంబంధం నెరపుకొని వుంటాయి. అందుకే నిరాలా కావ్య ప్రపంచంలో వాస్తవికతా అనుభవాలు, వాటిని చిత్రించే పార్శ్వాలూ - వైవిధ్యభరితంగానూ, సంక్లిష్టంగానూ వుంటాయి.

# 7. పరిచిత రూపాన్ని అధిగమించిన కథానిక

నిరాలా కథానికల అనుభవ ప్రపంచంలో, వాటి స్థాపత్యంలో సంచరించడం ఒక ఇంపైన, కొన్ని సందర్భాల్లో ఉత్తేజకరమైన అనుభవం, కథానిక ప్రక్రియతో నిరాలా సంబంధమే ప్రత్యేకం. ఉపోద్ఘాతంలో నిరాలా తన కథానికలు కవిత వాస్తవిక సంఘటనల నుంచి సంకలింప బడినాయని అంటూ, శాశ్వత సాహిత్యంలో భాగంగానే తన కథానికల్ని చూడాలని విలువకట్టాలని డిమాండ్ చేశాడు ఈ కథానికల్లో కొన్ని పచ్చి కాల్పనిక సంవేదనతో కూడుకున్నవి, కొన్ని సౌందర్యవాదం ప్రయోజనవాదం మధ్య సమతౌల్యం సాధించడానికి మార్గం అన్వేషిస్తాయి, కొన్ని చోట్ల వాస్తవికత, విశృంఖల కల్పన (ఫాంటసీ) ల మధ్య ఘర్షణ జనింపజేసే సరికొత్త రచనాత్మక అభిరుచిని కల్గిస్తాయి. ఆధునికం అని పిలువబడే సమాజంలో మానవత్వం లోపించటం, అలా లుప్తమైన మానవత్వాన్ని తిరిగి గుర్తించడం బహుశా నిరాలా కథానికల్లో విషయం అన్పిస్తుంది. కొన్ని కథానికల్లో నిరాలా సాహితీ జీవితం, కవి వ్యక్తిత్వపు ఎన్నో సమస్యల సూత్రాలు చిక్కుబడి వుండటం చూస్తాం. వాస్తవిక అనుభవాల్ని వాటి సంశ్లిష్టతతో చూడాలని భావిస్తాడు నిరాలా. కాని, కొన్ని కథానికల్లో సాదాసీదా ముగింపుతో వాటిలోని ఆకర్షణ శక్తి కాస్త కనుమరుగైంది. కాని, విఫలమన్పించినా కూడా కొన్ని కథానికలు ఆయన రచనా ప్రక్రియలోని అంతః సంఘర్షణని ప్రతిబింబిస్తాయి. అందుకే ఈ కథానికల్ని సమగ్రంగా చదవాల్సిన అవసరం వుంది. విసుగు పుట్టించే బరువైన సన్నివేశాల్ని అధిగమించి నిరాలా కథానిక ఎప్పుడు ఒక రూపాన్ని సంతరించుకుంటుందో ముందుగానే తెలుసుకోవడం కష్టం.

హిందీ కథానికా వివేచనలో నిరాలా కథానికల చర్చ చాలా తక్కువగానే జరిగింది. ఎందుకంటే బహుశా, కథానిక సగటు రూపాన్ని టెక్నిక్‌నూ, స్వభావాన్ని నిర్మాణాన్నీ ఆయన కథలు అతిక్రమిస్తాయి కథానిక కుండే సాధారణ నిర్వచనాన్ని లేక భావనను ధ్వంసం చేస్తాయి. కథానికలో ఏదైనా ఆనందసారాన్ని వెదికేవాళ్లకు నిరాశే మిగులుతుంది. ఈ కథానికల ప్రభావసామర్థ్యం, ప్రభావ పరిమితి ప్రత్యేకమైనవి. ఆయన కథాసంకలనాలు - 'లిలీ', 'సఖీ', 'సుకుల్‌కీ బేటీ'లో దాదాపు రెండు డజన్ల కథానికలు ఉన్నాయి. 'ప్రేమ్‌పూర్ణ్ తరంగ్', 'క్యా దేఖా', 'పద్మా ఔర్ లీలీ', 'జ్యోతిర్మయి', కమల', 'శ్యామ్', 'ప్రేమ్ కా పరిచయ్', 'హిరణి', 'పరివర్తన్', 'అర్థ్', 'న్యాయ్', 'స్వామి శారదానంద్ మహారాజ్ ఔర్ మై', 'దేవి', 'చతురీ చమార్, రాజా సాహబ్ కో రేంగా దిఖాయా', 'సఫలతా', 'భక్తి ఔర్ భగవాన్', 'సుకుల్‌కీ బేటీ', 'శ్రీమతి గజానంద్ శాస్త్రిణి', 'దేవర్ కా ఇంద్రజాల్', 'జానకీ', 'దో దానే', 'విద్యా', ఇవీ శీర్షికలు

పైన పేర్కొన్న కథానికా శీర్షికలే విషయపరమైన భిన్నత్వాన్ని సూచిస్తాయి - తుచ్ఛము, క్షుద్రము లేక సాధారణ మన్పించే జీవిత స్థితులను కూడా మంచి కథానికలుగా మలుస్తాడు నిరాలా. తన సంస్కరణ - సన్నివేశాలకు కూడా కథానిక రూపం ఇస్తాడు. వీటిలో కొన్ని కథానికల్లో ప్రేమను అపహాస్యం చేసి చూపిస్తాడు. ప్రేమ సంబంధమైన భావుకతను అపహాసిస్తూ, జీవితంలో ఒక నూతన సంకల్పాన్ని సూచించ గలిగే ఏదో ఒక ఆచారాన్ని ప్రతిఘటించగలిగే లేక జీవితంలో ఏదో లోతైన అర్థాన్ని సంతరించి పెట్టగలిగే ప్రేమ సార్థకం కాదని నిరాలా భావిస్తాడు. కులం కట్టడినీ, ఇతర దురాచారాలనూ ఉల్లంఘించేందుకు నిరాలా పాత్రలు ప్రయత్నిస్తాయి. చాలా కథానికల్లో, దాయాదుల స్వార్థాలూ, కుట్రలు - కూహకాల సన్నివేశాలూ వెల్లడి అవుతాయి. వీటి సంబంధం నిరాలా పోరాటశీల జీవితంతో పెనవేసుకొని వుంది. తన జీవిత వాస్తవికతను చిత్రిస్తూ నిరాలా తన వ్యక్తిత్వం నుంచి కొంచెం దూరంగా ఆ చిత్రీకరణ వుండేట్లు చూసుకుంటాడు. వ్యక్తిత్వ జోక్యమూ వ్యక్తిత్వం నుంచి దూరమూ రెండూ వున్నాయి ఈ కథానికల్లో. అన్ని కథానికల ప్రభావమూ ఒకలాగా లేకపోయినప్పటికీ నిరాలా వ్యక్తిత్వస్పర్శ మాత్రం సర్వత్రా కన్పిస్తుంది.

నిరాలా రచించిన చాల కథానికల్లో స్త్రీల జీవిత చిత్రాలు వెల్లడౌతాయి. ఈ యువతుల రూపాన్ని, వ్యక్తిత్వాన్నీ చిత్రించేపుడు నిరాలా ఛాయావాద సౌందర్య సంస్కారాలే వారి వేదనను ఉదాత్తంగా వుండేట్లు చేస్తాయి. ఈ స్త్రీల సమస్యలు తరచు చమత్కార పూరిత పద్ధతిలో పరిష్కరింపబడతాయి.

'పృథ్వీ ఔర్ లిలీ', కథానికలో పద్మ రాజేంద్రకు చేరువవుతుంది. కాని, తండ్రి ఈ కులాంతర వివాహాన్ని ఒప్పుకోడు. రాజేంద్ర విదేశం వెళ్లి బారిస్టరై తిరిగి వస్తాడు, దేశ సేవకు

అంకితమౌతాడు. పద్మ కూడా ఆడపిల్లలకు చదువు నేర్పుతుంది. తండ్రి చనిపోవడంతో వారి పెండ్లికి అడ్డంకులు తొలగిపోతాయి 'జ్యోతిర్మయి', లో ప్రేమికుడు విధవ అయిన యువతిని పెళ్లి చేసుకోలేకపోతాడు అచారాల ముసుగులో కట్నం, ధనలోలుపత్వం ప్రధాన కారణాలుగా వివాహం జరగదు. విధవరాలు జ్యోతిర్మయితో కాని వివాహం, మోసంతో కుమారిజ్యోతిర్మయితో జరిగిపోతుంది.

'కమల' కథానికలో 'సోదరుల' కుట్రవల్ల రమాశంకర వాజపేయి తన భార్యను త్యజిస్తాడు - ఆతని సోదరులు కమల, ఆమె తల్లి శీలాన్ని శంకిస్తారు. పల్లె యొక్క సామాజిక జీవనంలో ఈ ఆచారాల ఒత్తిడి ఏమిటో, ఎంత అనర్ధదాయకమో నిరాలాకు తెలుసు. భర్త వాజపేయి వుండే కాన్పూర్ పట్టణంలో అల్లర్లు జరుగుతాయి - అవివాహితయైన ఆయన సోదరి, ఇంటి కోడలూ ముసల్మాను ఇంటినుంచి బయటపడతారు. కమల సోదరుడు రాజకిశోర్ వాళ్లకు ఆశ్రయమిస్తాడు - వాళ్లు ఏ కుటుంబం నుంచి వచ్చారో తెలియకుండానే. వాజపేయి గారు వాళ్లను తీసుకెళతారు, ఈ రహస్యం పైకి పాక కూడదని అర్థిస్తాడు. కాని వాళ్లకు ముందుగానే కళంక సమాచారం చేరి వుంటుంది భ్రాతృకలహాలు అక్కడ కూడా వాళ్లను విడదీస్తాయి. రమాశంకర్ వాజ్పేయి రెండవ వివాహం చేసుకున్నాడు కాబట్టి కాని, కమల ఉదాత్తమైన మనసుతో వాజపేయి సోదరితో తన సోదరుని వివాహ సంబంధానికి అంగీకరిస్తుంది. ఈ మలుపుల కథానికలో ముగింపు అసహజమన్పిస్తుంది. జీవితంలో మామూలుగా జరగనిదేదో ఇందులో జరుగుతుంది - కాని నిరాలా కమల పాత్రను ఒక ఉన్నత స్థానంలో నిలపాలని ఆశించాడు.

ఆదర్శవాదానికి ఉదాహరణ 'సఖీ' కథానిక. పేదబాలిక లీల కోసం ఆమె స్నేహితురాలు జ్యోతిర్మయి చేసిన త్యాగం అసాధారణం, అనూహ్యం. జ్యోతిర్మయి వివాహం ఒక ఐ.పి.యస్. వరునితో నిశ్చయమౌతుంది. స్వీయ రక్షణ కొరకు లీల ఆతని ఆశ్రయం పొందుతుంది. చివరికి, జ్యోతిర్మయి ఆతన్ని లీలను పెళ్లి చేసుకునేందుకు ఒప్పిస్తుంది.

'హి రన్' కథానికలో అమ్మా నాన్న లేని హిరన్‌ని రాణిగారు దగ్గర తీస్తారు. ఆమె హిరన్ అంటే ఇష్టపడింది అసలు 'హిరన్' పేరే ఆమె పెట్టింది - ''నిశ్చితమైన దృష్టి తంత్రులు ఈ లౌకిక పరిచయంతో కాదు, శూన్యాకాశంతో పెనవేసుకొన్నట్లున్నాయి. వీటిని భూమికి పంపి బ్రహ్మ ఒక పొరపాటు చేశాడేమో. ఈ భావ దర్శనం వల్ల హిరన్ పేరు కవి నోటి నుండి వూడి పడే ఒక పదంలాగా రాణిగారి కంఠం నుంచి నిసర్గంగా వూడి పడింది.'' ఆ రాణీగారే ఈ పాప వివాహం రామ్ గులామ్‌తో కుదుర్చుతారు. కానీ, ఆమె దాసీల చాడీలు విని హిరన్ పట్ల క్రోధం పెంచుకొని ఒక మానసిక రోగి అయిపోతుంది. ఈ సాన్నిహిత్యాన్ని

ఛిన్న మనస్థితినీ అర్థం చేసుకొనేందుకు నిరాల కథానికలో చాలా భాగాలు అలా వదిలేశాడు, విరామాలుగా.

'సఫలత' అనే కథానికలో విధవరాలు ఆభ అకారణంగా అవమానం సహించాల్సి వస్తుంది. నిరాలా దీన్ని వ్యక్తీకరిస్తూ నరేంద్ర - ఆభల సంబంధం కష్టాల గుండా ముందుకు పోయేందుకు దారి చూపుతాడు. వాళ్లు ఓ నాటక కంపెనీ నడుపుతారు, నాటకాలు రాస్తారు, ప్రదర్శనలిస్తారు చివరికి నరేంద్రను కొల్లగొట్టిన ప్రచురణకర్తే ఓడిపోతాడు. నిరాలా మనసులో ఇచ్ఛా పూర్తి అనే మనోవైజ్ఞానిక సూత్రమే ఇందులో పనిచేసింది.

'దేవి', 'చతురీచమార్', 'భక్తి ఔర్ భగవాన్', 'అర్థ్' కథానికలు నిరాలాలోని రచనాత్మక కథా సంవిధాన ప్రత్యేకతను సంతరించుకొన్నట్టివి. 'దేవి', 'చతురీచమార్'లలో కథానిక సాధారణ శిల్పం ఖండితమౌతుంది. నిరాలా వీటిలో 'వ్యాసం', 'సంస్మరణ', 'రేఖాచిత్రం', 'కథానిక'ల వ్యత్యాసాన్ని రూపుమాపుతారు. వ్యంగ్యం లేక స్వీయవ్యంగ్యం ముందుండిన కాల్పనిక ఆదర్శవాదానికి ఈ కధానికలు దూరం 'దేవి' కథానిక ఎత్తుగడే ఈ రూపగత భిన్నత్వానికీ, ప్రభావ భేదానికీ ఉదాహరణ.

''పన్నెండేళ్లుగా సాలెపురుగులా పదాలవలనేస్తూ నేను గోళ్ళు గిల్లుకుంటూ ఉండినాను. నేనూ చూస్తూ ఉన్నాను. సాహితీ సంరక్షణకై నేను చక్రవ్యూహం పన్నుతున్నాను ఇందువల్ల దాని ఇల్లు కూడా అందంగా ఉంటుంది. దాని శక్తి సంచాలన కూడా బాగుంటుంది కానీ జనానికి దీంట్లో ఇరుక్కుపోతామేమోననే భయం ఆవహిస్తుంది. అందువల్ల దీని ఫలితం తలకిందులైంది. నేను వాళ్లను సాహితీ స్వర్గంలోకి తీసుకెళ్తానంటే, వాళ్లు తమ చావు గురించి ఆలోచించేవాళ్లు. ఇది ఒక భ్రమ. అందువల్ల నాకు గౌరవం లభించలేదు నేనేమో ఎప్పుడూ అర్ధాకలితోనో వస్తులుంటూనో వుండేవాణ్ని. నేను కలల్లో అప్సరసల్ని చూసేవాణ్ని ఈ విధంగా నా తరఫున జనాన్ని ఉన్నతి వైపు వెళ్లేలా నేను చేస్తుండినాను. కానీ జనం నన్ను కిందికి లాగడానికే సన్నద్ధమైనారు. నేను సాహిత్యాన్ని నరకం నుంచి కాపాడి స్వర్గతుల్యం చేయాలనుకున్నాను. అందుకే నా ప్రపంచం కూడ నా నుండి దూరమవుతూ పోయింది ''

ఈ కథానికలోని నిరాలా దుఃఖానికి, వ్యంగ్య వినోదాలకీ మధ్య ఒక అద్భుతమైన సంబంధం నెలకొల్పుతాడు ఈ వ్యంగ్యం లక్ష్యం ఒకపక్క ఛాయాలోకమైతే, మరోపక్క స్వయంగా నిరాలాయే. ఉన్మాదినియైన బిచ్చుగత్తె ఒక నిష్ఠుర సత్యం సభ్యసమాజం సులభంగా ఎదుర్కొనలేని నిష్ఠురసత్యం.

'నేను గొప్ప అనే భావన ఈ స్త్రీ ముందు ఓడిపోయింది - నేను గొప్పవాణ్ణి కాగలనేమో, కానీ ఈ స్త్రీకి ఏ ఆశాలేదు. ఈమె హస్తరేఖ మారదు. జ్యోతిషపు సుఖదుఃఖ చక్రం ఈమె జీవితంలో చలనంలేనిది. సహిస్తూ సహిస్తూ దుఃఖం అనేది ఇపుడామెను సోకలేదు. ఏ చెట్టు నీడనో లేక యే ఖాళీ వరండాలోనో కూర్చొని మధ్యాహ్నపు మండుటెండలో ఆకసంకేసి చూస్తూ వుండిపోతుండవచ్చు.'' నిరాలా ఆ ఉన్మాదిని మృత్యువును చిత్రిస్తూ అంటాడు -

'నేను చూస్తూ వుండినాను. పొగకింద దీపశిఖలా ఆ ఉన్మాదినిలోని దేవకన్య ఈ ప్రపంచాన్ని వదిలి ఎక్కడికో ఎగిరిపోయేందుకు ఉద్యుక్తురాలైంది. ఆమె చామనచాయ గలది - ప్రపంచం కళ్లను సమ్మోహితం చేసేందుకు ఆమెలో ఏమీలేదు. ఇతరులు ఆమెపట్ల వ్యక్తమయ్యే నిర్లక్ష్యం వైపు దృష్టి సారించరు కానీ, నా కళ్లకు కన్పించిన ఆమె రూపాన్ని నా కల్పనా ప్రపంచంలోకి ఆహ్వానించి ఆమెపై సాహిత్యం రచిస్తాను. కేవలం ఆమె రూపంపై కాదు, భావంపై కూడా.''

నిరాలా దృష్టి ఉన్మాదిని ఒక్కో చేష్టపై వుంది. ఉన్మాదిని రూపం నిరాలాకు ఆదిశక్తి గుర్తుకు వచ్చేట్లు చేస్తుంది. ఆమె బిడ్డలో నిరాలా నిజమైన భారతదేశాన్ని చూస్తాడు. ఒకరోజు ఒక నాయకుని వూరేగింపు ఆ పిచ్చిదాని ముందు నుంచి పోతుంది. ఆమె జనం గుంపును తీక్ష్ణంగా, తీవ్రంగా చూస్తుంది. అక్కడే ఆమె శిశువు, కిందబడి తొక్కిసలాటకు గురవుతుంది. ఆమె జనాన్ని జ్వాలామయ దృక్కులతో చూస్తుంది. నాయకులు పదివేల డబ్బు సంచి తీసుకొని వెళ్లిపోతారు ఉన్మాదిని కులమేదని అందరూ చర్చిస్తారు. కాని ఆమె కోసం ఏదైనా చేద్దామనే ప్రశ్న వచ్చినపుడు, నవ్వి పక్కకు తొలగిపోతారు.

ఒకరోజు సైనిక పటాలం ఒకటి భయానక ప్రదర్శన నిర్వహిస్తుంటుంది. ఆ ఉన్మాదిని దీన్ని చూసి నవ్వుకుంటుంది. తన బాబును కూడా ఈ నవ్వులో పాలుపంచుకునేట్లు చేయాలనుకుంటున్న ఉన్మాదిని హాస్యాస్పద చేష్టల వెనుక పెద్ద బాధ నిక్షిప్తమై ఉంది వ్యవస్థపట్ల ఒకలాంటి తిరుగుబాటుతో సహా వ్యంగ్యమూ, వేదన-ఈ రెండుకలబోసిన ప్రత్యేకత నిరాలాదే. వైరుధ్యాల ఈ సామరస్యం 'సరోజస్మృతి' కళాత్మకత నిషేధంలో కూడా నిరాలా తన తిరుగుబాటు తత్వం ప్రదర్శిస్తాడు. 'దేవి' కథానిక ఆస్పత్రిలో ఉన్మాదిని మృత్యువుతో ముగుస్తుంది. కాని ఇది ఎవరికీ పట్టదు. ఈ మృత్యువు చాలా రోజుల్నుంచి ఎదురుచూసిందే. స్వయంగా అది పెద్ద ఘటన కాదు. మేనేజరు గారు సంగమ్‌లాల్‌కు పది రూపాయిలివ్వాల్సి వస్తుందేమోనని భయపడి చెక్ మార్పించుకు పారిపోవడం - ఇదీ ఘటన - అందరూ దీనికి నవ్వుతారు - సంగమ్‌లాల్ కూడాను, నిరాలా కూడాను.

'చతురీ చమార్'లో చతురీయే కాదు బైసవాడ పోరాట స్వభావం కూడా వ్యక్తమయింది. కథానిక కాదు అది రిపోర్టులాంటిది. ఒక యుగపు పోరాటానికి దస్తావేజు రాసేందుకు చతురీ పాత్రను నిరాలా ఆధారం చేసుకున్నా, కథానిక ఆరంభలోనే నిరాలా ఆ గ్రామం భౌగోళిక స్థితి రేఖామాత్రంగా సూచిస్తాడు ఈ వాస్తవ వివరణలో కథానిక వాస్తవికతా వాద రచనా విధానం ఇమిడివుంది

''చతురీచమార్'' గఢ్‌కోలా గ్రామం చమియానా పోస్టు, ఉన్నావ్ జిల్లాకు చెందిన ఒక పాత కాపురస్తుడు మా పూర్వీకులే కాదు, మానాన్నగారి, మరీ చెప్పాలంటే వారి పూర్వీకుల ఇళ్ల పెరటికి కొంచెం దూరంలో, మరికొన్ని ఇళ్లపక్క వుండే మురికికాల్వల, వాన కురిస్తే వచ్చే శుభ్రమైన నీటివాలు పక్కన చతురీచమార్ పాత కొంప వుంది

ఈ వాస్తవం గ్రామ సామాజిక సంబంధాల నిర్మాణం అర్థం చేసుకునే దానికి సాయపడుతుంది. పల్లెటూరి సంబంధం చెప్పాలంటే, చతురీ వారి సోదరుని కుమారుడు అవుతాడు. అతడు తన - సాహిత్యంలో ఈనాటి అనేక రచయితల మాదిరి అపరివర్తన వాది.

ఈ రెండవ వ్యంగ్యంలో నిరాలా అభిప్రాయం స్పష్టమే. నిరాలా బాహ్యజీవితంలో సామాజిక ఆచారాలు, వర్గపోరాటం గమనిస్తాడు. రైతుల పోరాట వాస్తవికతను చూస్తాడు. చతురీ నిర్గుణ వ్యక్తిత్వం, కబీర్ కవితల మార్మికతను అర్థం చేసుకోగలిగిన ఆతని సామర్థ్యము, పోరాటంలో కూడా సజీవంగా వుండే ఆతని స్వాభిమానమూ చూస్తాడు. చతిరీ జీవితాంతం చెప్పులు కుడుతూ గడిపాడు. కానీ కొడుకును మాత్రం చదివించుకోవాలనుకుంటాడు ·నిరాలా, కొడుకును చదివించుకోవడానికి ఇష్టపడతాడు. ద్విజసంస్కృతి నిరాలాను బయటి మనిషిగా అనుకోనారంభించింది నిరాలా శూద్రుల నుంచి మాంసం తీసుకుంటాడు వాళ్లతో తింటాడు - తిరుగుతాడు. తన కొడుకులో చతురీ కుల స్వభావం చూసి, - వ్యవస్థలో మామూలుగా ఉండేదే ఈ స్థితి - మాదిగలు అణగివుంటారు - బ్రాహ్మణులు వారిని అణగ దొక్కుతారు - దీనికి చికిత్స ఏమంటే - ఇద్దరి పేర్లనూ పెకలించి వేయడమే దేశంలో ఉద్యమం వూపందుకుంటోంది - గఢకోల కూడా - రైతులు ఒకచోటే కూడుతారు - జెండాగీతం పాడతారు. కొంతమంది రైతులపై ఒక సంవత్సరపు ధాన్యం పొట్టును మూడు సంవత్సరాల కిందదిగా రాసి జమీందారు తరపున దావాలు వేస్తారు.

పోలీసు ఇన్‌స్పెక్టరు విచారణకు వస్తాడు. కచ్చా రంగుల్లో రంగరించిన మువ్వన్నెల జెండా ఆంజనేయస్వామికి ఎదురుగా ఒక పెద్ద వెదురు కర్రకు గుచ్చినారు, అది వర్షం వల్ల

వెదురులో కరిగి తెల్లగా ఆయిపోతూ వుంది. ఇన్స్పెక్టరుకు ఆలయంలోని జెండాలో రంగు కన్పించదు. జమీందారులే చెబుతారు జెండా కాంగ్రెసుదని. 'మీరు కాంగ్రెసుకు చెందిన వారా?'' అని నిరాలాను అడిగినపుడు ''నేను 'విశ్వసభ' సభ్యుణ్ణి - దీనిలో చాలామంది నోబెల్ పురస్కారం పొందిన వ్యక్తులు సభ్యులు'' - అని అంటాడు నిరాలా - ఇన్స్పెక్టరు వెళ్లిపోతాడు. కేసు జరుగుతూ ఉంటుంది. గౌ॥ మేజిస్ట్రేట్ బంధువు జమీందారు తరపున వకీలు, కాబట్టి రైతులపై జమీందారుగారికి డిక్రీ ఔతుంది. కొందరి ఎద్దులు వేలం వేయబడతాయి. జనం భయపడతారు. పోరాటం జరిపేందుకు ఇపుడు చతురీయే మిగిలాడు. గ్రామస్థులు సాక్ష్యం ఇవ్వడానికి కూడా తయారుగా లేరు. రైతు ఉద్యమ వాస్తవస్థితి ఇది దీన్నే నిరాలా వాస్తవిక పద్ధతిలో రిపోర్టులాంటి ఈ కథానికలో చిత్రించాడు. చాలాకాలం తర్వాత 'చతురీచమార్' చదువుతుంటే ఈ నాటి కవిధూమిల్ కవిత 'మోచీరామ్' గుర్తొస్తుంది. కాలాన్ని అధిగమించి జరగబోయే కథను నిరాలా ఆనాడే రాశాడా అనిపిస్తుంది.

'అర్థ్' కథానికలో నిరాలా ఒక యువ భక్తుడు. రాజ్‌కుమార్ మనస్థితి చిత్రించే నెపంతో ఒక సంక్లిష్ట అనుభవ ప్రపంచాన్ని ఆవిష్కరిస్తాడు. ఇందులో విశ్వాసము, సంశయాల మధ్యసాగే గంభీరమైన సంఘర్షణ రూపుదిద్దుకుంది. సఫలత్వం పొందిన అంతిమ భాగాన్ని వదిలేస్తే, ఇది ఒక గొప్ప కథానిక అవుతుంది. వాస్తవికత, అవాస్తవికతల మధ్య వుండే మానసిక సంఘర్షణ నుంచి నూతన అర్థం రూపందాల్చుతుంది రాజ్‌కుమార్ ఆభిజాత్య బ్రాహ్మణుల అబ్బాయి. భీముడు, హనుమంతుడు, రాముడు వీళ్ళంతా ఇపుడు కూడా అద్భుత కృత్యాలు చేస్తున్నట్లు, ఎపుడూ వూహిస్తూంటాడు. హిందూమతంపై ఇంతటి విశ్వాసం ఆతనిది ప్రవేశికలో ఉత్తీర్ణుడౌతూనే ఆతనికి పెళ్లవుతుంది. మ్లేచ్ఛుల భాషపట్ల ఆసక్తిలేదు గనుక చదువు ఆపేస్తాడు అమ్మ, నాన్న చనిపోతారు, దాంతో ప్రపంచజ్ఞానం కలుగుతుంది కాని, మనసును ప్రాపంచిక వ్యవహారాల నుండి కష్టపడి దూరం చేసుకుంటాడు. దహన సంస్కారానికి మొదలుకొని ఏళ్లతరబడి దాయాదులు ఆతనిచేత బాగా ఖర్చుపెట్టిస్తారు. ప్రాపంచికమైన ఆచారాలు పాటించేందుకు భార్య నగలు కూడా కుదువ పెట్టాల్సి వస్తుంది. భరతుని పేరు జపించి డబ్బుకోసం తువాలు పరుస్తాడు. రాముని పేర చిత్రకూట చిరునామాకు జాబు రాస్తాడు. ఈ ఆశలన్నీ అడియాసలౌతాయి. ఆతని మనసు మనసులోలేదు. భార్యను పుట్టినింటికి పంపి తను ఉద్యోగం కోసం వెదుకుతూ, వెదుకుతూ పోతాడు. నిరాశచెందుతాడు - ఇది రాజ్‌కుమార్ మొదటిసారి నిస్పృహ చెందిన సమయం. ఆతను తనను తానే ప్రశ్నించుకుంటాడు - రాముడు మిధ్యా కల్పనయేనా? ఎక్కడా ఉద్యోగం దొరక్క ఆతడు నేరుగా చిత్రకూటం వెళతాడు - తన సామాను, డబ్బు

దారిలో రైలు నుంచి బయట పారవేస్తాడు. రాముని దగ్గరికి వచ్చేటప్పటికి ఆ సామానంతా భారమైనట్లు అన్పిస్తుంది. ఆంజనేయుని దర్శించేటప్పుడు డబ్బులు చదివించకపోతే పూజారి తిడతాడు. కామదగిరిపై సీతాలక్ష్మణులతో పాటు రాముడు కూడా ఉన్నాడు. పెద్దపెద్ద చెట్లు గాలిలో వూగుతూ అంటున్నాయి - 'మేము స్వయంపూర్ణం. మాకేమీ అక్కరలేదు.' ఇదీ మనస్థితిని 'తులసీదాస్' లో నిరాలా వ్యక్తం చేసే ప్రయత్నం చేశాడు -

చెట్లన్నీ, మొక్కలన్నీ, గడ్డిపోచలన్నీ నవ్వుతూ సుకుమారంగా
చూసిఏదో, ప్రాణాలు త్యజించినట్లు -

అతడు రాత్రికి రామునితో కలవడం సులభమని కొండపైకి ఎక్కసాగాడు - ఆ క్షణం సుందరమూ, భయానకమూ ఆయిన క్షణం.

''కామదగిరి భయంకర రూపం దాల్చుతోంది మృత్యువు కూడా ఇపుడు తుచ్ఛమే. సాక్షాత్తు సత్యం, చిరకాలం నుంచి ప్రేమాస్పదుడైన శ్రీరాముడొక పక్క, భయానక ప్రకృతి, దుర్గమ పర్వతాలు అపారమైన అడ్డంకులు, ప్రాణంపట్ల మమకారం పెంపొందించే ఇవన్నీ మరోపక్క-ఒక్కసారి కొండవైపు మెడ ఎత్తి రామ్‌కుమార్ చూశాడు. కటిక చీకటి తప్ప మరేమీ కన్పించడం లేదు.''

ఈ కొండను 'రామ్‌కీ శక్తి-పూజ'లోని పర్వతాన్ని సమాంతరంగా వుంచి చూడటం సహజం. అక్కడ రాముడు సముద్రపు హోరువింటాడు - ఇక్కడ సముద్రం లేదు, కొండలు గర్జిస్తాయి దట్టమైన చీకటి రెండు సందర్భాల్లోనూ వుంది. క్రూరమైన రాత్రి కామదగిరి భయంకర రూపం - రామ్‌కూమార్ మనసు చెబుతోంది - ఆ రాముడైనా దొరకాల లేదా, మృత్యువైనా రావాల రామ్‌కుమార్ దుస్తులు విప్పి పారేస్తాడు. దేహమపుడు ఒక పుష్పంలా తేలికైనట్లు అనుభూతి చెందుతాడు. నడుము వరకు పెరిగిన గడ్డి వుంది. రాళ్లు పాచిబట్టి వున్నాయి పాములు, తేళ్ల భయం వుండనే వుంది. కాని, రామ్ కూమార్ మనసు ఇదంతా అర్థం చేసుకొనే స్థితిలో లేదు. కొండ నుంచి పారే సెలయేరు ఎక్కడ ఎండి పోయిందో అక్కడ ఆగి పైకి ఎక్కసాగాడు. అచట ఆతనికి ఆంజనేయస్వామి దేహం నుంచి నెయ్యితో కలిపిన సింధూరపు వాసన వస్తుంది ఏదో వింతైన మాంత్రిక ప్రభావం వ్యాపించింది ఈతనిలో. హనుమంతుడు ఆతనికి సానుకూలం అన్పిస్తాడు సాహసం చేసి పైకి ఎక్కుతాడు కాని, ఇలా ఎక్కడం ఎంత వరుకు? చాలా దూరం వరకు పర్వతం అలాగే నిలిచివుంది - పై నుంచి కిందికి వేలాడదీయ బడినట్లు. వాన కురుస్తోంది. ఆ పర్వతం కింద ఆతనికి ఏడ్పువస్తుంది. తిరిగి వచ్చి చూస్తే దుస్తులు కన్పించవక్కడ. గాలికి కొట్టుకొని పోయాయి. నగ్నంగా పరుగెత్తుతాడు. సీతాపురం వెళ్లి ఒక బ్రాహ్మణుని అంగవస్త్రం ఇమ్మని

అడుగుతాడు. కాని, ఆ బ్రాహ్మణుడు ''దొంగ దొంగ'' అని అరుస్తాడు. అన్ని విధాలా ఓటమి చవిచూసిన రామ్‌కుమార్ పారిపోతాడు. దుఃఖము, గ్లాని, కలత, బడలికతో, ఓడిపోతాడు. ఆతనిపుడు సిగ్గుపడటం మానేశాడు ఇప్ప చెట్టు కింద స్పృహ తప్పిపడిపోతాడు. నిర్మలంగా వుండటం ఏమిటో ఇపుడు తనకు అనుభవమయింది. కాని, ఇంకా, సంశయం వీడలేదు -

రాముడున్నట్లా, లేనట్లా! అంతా మిథ్య!

ఒక చిలుక కొమ్మ మీద కూర్చొని పలుకుతుంది - ప్రశ్నలతో సంశయంతో నిండి వుంది మనసు. పైనుంచి శబ్దం విన్పిస్తుంది -

'చిత్రకూటం' అని వ్యాకరణ జ్ఞానంతో దీని అర్థం తీస్తాడు -

'విచిత్రం, ఇతని ఇల్లు' -

అని. నిద్ర లేస్తూ నే పక్షి ఎగిరిపోతుంది దీనికి చాలా అర్థాలున్నాయి. చుట్టూ తిరగసాగింది భూమి. చెట్లు కూడా తిరగసాగాయి. జ్ఞాని శుకదేవుని దిగంబర తపస్వి రూపం మనసులో తటిల్లతలా స్మరణకు వస్తుంది. ఇప్పుడు నేను చూసింది రాముణ్నేనా అనే ప్రశ్న ఉదయిస్తుంది. దారిలో పశువులు కాసే పిల్లలు కన్పిస్తారు ఆతన్ని సాధువనుకొని దగ్గరున్న పల్లెకు పొమ్మంటారు. ఆతని మనసు స్వప్నలోకంలో తేలియాడుతుంది. అద్భుత విశ్వ ప్రకృతిలో తన్మయుడౌతాడతడు. ఇల్లు-వాకిలి, చెట్లు-చేమలు అన్నీ ఛాయా మాత్రంగా కన్పిస్తాయి. తర్వాత ఒక మిత్రునితో కలవడం జరుగుతుంది, మనసు ఈ లోకం లోకి వస్తుంది. నగ్నంగా వుండటానికి సిగ్గు పడతాడు. కలలో శ్రీరాముని చూస్తాడు.ఆయన తనతో అన్నట్లు వుంది - ''నీవు ధనం కోసం చాల శ్రమ పడ్డావు. నేను నీకు ధనం ఇస్తున్నాను''

కథానిక ముగింపు కృత్రిమ సమాధాన పూర్వకంగా వుంది. రామ్‌కుమార్‌కు నవయుగ ప్రెస్‌లో ఉద్యోగం దొరుకుతుంది నాలుగేళ్ళలోనే అతను నవలాసాహిత్యంలో శిఖరానికి చేరతాడు వేలరూపాయులు కూడబెడతాడు. అప్పులు తీర్చి భార్య విద్యతో సుఖంగా వుంటాడు. కథానిక ఇంద్రజాలం ఇంతటితో ముగుస్తుంది. ఒక పౌరాణిక కథలా పకడ్బందీ ముగింపుతో సమాప్తమౌతుంది ముగింపుకు ముందు తీవ్ర మానసిక ఘర్షణను చూపించడంతో కథానికకు బలం చేకూరుతుంది దాని ప్రతిధ్వని చాలసేపు మనసులో వుండిపోతుంది

'భక్త్ ఔర్ భగవాన్' కథానిక కూడా మానసిక ద్వంద్వాన్ని వ్యక్తీకరించడంలో

చెప్పుకోదగ్గది. వాస్తవికత, అవాస్తవికతల మధ్య జరిగే పోరాటాన్ని ఛాయా మాత్రంగా ప్రతిబింబించింది. ఈ కథానిక - ఆత్మకథ లాంటి ఈ కథానికలో నిరాలా జీవితానుభవాలు వ్యక్తీకరించబడినాయి. హనుమంతుని పూజలో లీనమైన భక్తుని స్వభావం ఏమిటంటే, ఋతువులు నిదానంగా మారుతుంటాయి. అవి చాల అందంగానూ, సుకుమారంగానూ వుంటాయి.

'ఎత్తైన పర్వత శ్రేణి నుంచి కిందికి పరవళ్ళు తొక్కే
నెలయేటి స్వరం వినిపించదు.'

హనుమంతుని విగ్రహం మాయమవుతుంది. అపుడు భార్య చీకటినుండి వెలుతురులోకి లేస్తూ ముందుకు వస్తుంది. తలపై సింధూరం మెరుస్తుంది. నాతలపై హనుమంతుని ధరిస్తున్నానని భార్య అంటుంది. భక్తుడు అడుగుతాడు - దీని అర్థమేమిటని. భార్య అంటుంది - "దీని అర్థం నేనే. నన్ను అర్థం చేసుకోండి." భార్య ఆకర్షణ కూడా భక్తుని మనసులో ప్రేమ జనించేట్లు చేస్తుంది. ఇపుడు కుటుంబంలో చావుల పర్యం మొదలవుతుంది - శ్రీమతి కూడా స్మృతిగా మిగులుతుంది. భక్తునికి రాజు దగ్గర ఉద్యోగం దొరుకుతుంది. కాని అది మంచి ఉద్యోగం అని అన్పించడం లేదు.

"మనసు పూజా సౌందర్యం వైపు మరలింది. శిస్తు వసూలు, జమా ఖర్చులు, లేఖలు, పుస్తకాలు, కోర్టులు, కేసులు లాంటి ప్రభుత్వ పనులు పాము కాటు వేసినట్లు తీవ్రంగా మంటలు రేపుతున్నాయి. మనసులో ఏవగింపు కలిగింది. రాజుకు దయాగుణం లేదు. కర్కశంగా ప్రవర్తిస్తాడు. ప్రజల రక్తం పీల్చడమే వాని స్వభావం." కలల్లో కూడా ఆత్మను హనుమంతునితో సామాజిక అసమానతల్ని గురించీ, దోపిడీతత్వం గురించీ ప్రశ్నిస్తువుంటాడు. నెమ్మది నెమ్మదిగా మనసు ఇక్కడ కూడా లగ్నమవుతుంది. కాని, ఏ చమత్కార పరిష్కారము కన్పించదు - హనుమంతుని దయతో తక్షణమే ఏదైనా చేయడానికి తన మానసిక ద్వంద్వపు ఎరుక చివరి వరకూ ఉంటుంది. ఈ దృష్టితో ఈ కథానకను 'అర్ధ్'తో పోల్చి చూస్తే దీని నిర్మాణ సౌష్ఠవం మెరుగైందని బోధపడుతుంది. ఇక్కడ, కలలు కంటున్న మనసు నిష్ఠురమైన వాస్తవికతతో ఢీకొంటుంది. దేశకాల వాస్తవికతతో, సమాజాన్ని కొల్లగొట్టే వాస్తవికతతో, భారతదేశము, హనుమంతుడూ ఏ అంశంపై ఒకటౌతారో, అది నిజంగా సమస్త జాతి వినూత్న భావన

రహస్యలోకం నుంచి సమస్యాత్మక వాస్తవికత వరకూ వ్యాపించిన నిరాలా కథానికల అనుభవ పరిధి చాలా విస్తృతం వ్యంగ్యము, కరుణల సార్థక సమ్మేళనంతో నిరాలా కథానికలు కథానికల పరిచిత చట్రం లోపల సరికొత్త రూపం సంతరించుకుంటాయి.

మొదట కొన్ని కథానికలు అలంకృత వచనానికి నిదర్శనాలుగా నిలిచిపోతాయి. కాని, తర్వాత వచ్చిన సంప్రదాయ కథానికలు - చదునుగా (ఫ్లాట్) కన్పించే ఈ బోలు కథానికల్లో ఒక ఉత్తేజకరమైన నవ్యత గోచరిస్తుంది. అర్థము, నిర్మాణం, ఈ రెండు స్థాయిల్లోనూ జీవితపు మౌలిక సమస్యల్ని ఎదుర్కొంటాడు. తరచుగా ఇలా సాగే కథానికల రూపంతో నిరాలా తమాషా చేస్తున్నట్లు కన్పిస్తుంది వ్యంగ్యంతో పాటు, వైపరీత్యాన్ని 'అర్థ్' 'భక్త్ ఔర్ భగవాన్' లాంటి ముఖ్యమైన కథానికల్లో వాడుకున్నాడు. భక్తిని, విముక్తిని అంగీకరించడం, తిరస్కరించడం - రెండూ నిరాలా కథానికల్లో కనపడతాయి. నిరాలా తన కథానికల్లో జీవితపు సవాళ్లను ఎదుర్కొంటాడు. వీలు దొరికినపుడు జీవితాన్ని అపహాస్యం చేస్తాడు. కల్పిత ఆదర్శవాదం, లేక సంస్కరణవాదపు సుపరిచిత తర్కము కూడా కొన్ని కథానికల్లో చూడవచ్చు - దీంతో పాటు దీని ఆంతరిక వైరుధ్యాలను గుర్తించడం కూడా చూస్తాము. ఆచ్ఛమైన, జీవనదాయకమైన విషాదానుభూతిని వ్యక్తం చేసే నిరాలా కథానికలు ఆధునికత, గాంభీర్యాల ఛద్మవేషాన్ని తుడిచి వేస్తాయి, లేక విచలితం చేస్తాయి.

# 8. నూతన సామాజికత – నవలావాస్తవికత

నిరాలా వాస్తవికతావాద దృష్టి వికాసం క్రమంగా 'కుల్లీభాట్', 'బిల్లేసుర్ బక్‌రిహా', 'చోటీకీ పకడ్', 'కాలే కార్నామే' లాంటి నవలల్లో రొమాంటిక్ కల్పన మనకు గోచరమౌతుంది. మన దేశపు స్వాతంత్ర్యపోరాట కాలాన్ని నిరాలా తన నవలలకు పునాది చేసుకొంటాడు; వలస వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక చైతన్యాన్ని నవజాగృతి దృక్పథంతో స్పష్టం చేసుకునేందుకు ప్రయత్నిస్తాడు నిరాలా. ఈ సందర్భంగా నవలా ప్రక్రియనుంచి నిరాలా అపేక్షిస్తున్నదేమిటి అనే విషయం మొదటే తెలుసుకోవడం మంచిది. తర్వాత ఈ అపేక్షలు నవలలో ఎంతమాత్రం ప్రతిబింబించాయో మనం చూడగలం. తన సాహితీ అనుభవాన్ని గురించి ఇలా అంటాడు నిరాలా:

''ప్రవాహానికి వ్యతిరేకంగా, ఒక సత్యం పునాదిగా నవల కొంగ్రొత్త రచనా దృశ్యాలు చూపించలేక పోతే, అది సాహితీ శక్తిని సంతరించుకోలేదు. అలాగే సమాజాన్ని, అది కదిలించలేదు.''

నిరాలా నవలల వెనుక సమాజనిర్మాణ సంబంధమైన క్రియాశీల చైతన్యం కన్పిస్తుంది నిరాలా తన నవలల్లో ఒక నూతన సామాజికత పట్ల నిబద్ధత వ్యక్తం చేస్తాడు. స్థూల సంఘటనల్ని లోతుగా అర్థం చేసుకొనేందుకు మనస్తత్వ అధ్యయనం అవసరమని ఆయన భావిస్తాడు. కాని, మానసిక స్థితి అవగాహనా, సామాజిక వాస్తవికతా అవగాహన-రెండూ వేరుకాదు. హిందీలో తమ సమస్త శక్తియుక్తులతో యుగపరివర్తన కోసం తపించే నవలాకారుల్లు లేనేలేరని, అందువల్ల నవలా భూమి పై ఆకురాలు కాలం తర్వాత వీచే

వసంత ఋతు వీచికా స్పర్శ కలగడం లేదని నిరాలా భావన. పరిస్థితులు మారడం లేక నవయుగ ప్రారంభం - ఇదే నిరాలా దృష్టిలో నవలను మన కాలంలో సార్థకం, సందర్భోచితం చేసే అంశం.

మొదటి దశలో వచ్చిన నవలల్ని చూస్తే నిరాలాకున్న కాల్పనిక ఆదర్శవాదం అన్నిచోట్ల కన్పిస్తుంది - కాని ఇక్కడ కూడ రహస్యమయ ప్రపంచం పట్ల ఉత్సుకత చూపే నిరాలా, కొత్త పోరాటాల దిశను గుర్తిస్తాడు. 'అప్సర'లో కనకం - రాజ్‌కుమార్‌ల సంబంధం ఒకే భావస్థాయిలో లేదు. రాజ్‌కుమార్ మార్మికలోకం నుంచి వాస్తవికలోకంలోకి వస్తాడు. మరలా మార్మికలోకానికి వాపసు పోతాడు. 'కనకం ముందు తాను నిస్సహాయుణ్ని - అనే భావనతో ఉన్నాడు రాజ్‌కుమార్. కనకం అతని సమస్త చేతననూ ఆక్రమిస్తుంది. ఆతను అన్ని విప్లవ నిర్ణయాలూ ప్రతినలూ మరచిపోతాడు. మిత్రుడు చందన్ విప్లవ పథంలో నడవడం చూసి, ఆతని అరెస్టు వార్త విని ప్రేరితుడై తన మోహజాలం నుంచి బయటపడతాడు. కాని, పరిస్థితులు మరలా ఆతన్ని కలలలోకంలోకి తీసుకెడతాయి. చందన్ ప్రయత్నాలలో రైతు సంఘనిర్మాణం లాంటి విషయాలు కూడా వున్నాయి. కాని ఆ చిత్రాలు స్ఫుటంగా కన్పించవు. రాచరిక వ్యవస్థ సుఖభోగాల వైపు నవల సంకేతిస్తుంది. కాని దీన్ని స్పష్టంగా ఎదిరించిన ఘటనలు ఇందులో లేవు. రాజ్‌కుమార్ మానసిక ప్రపంచంలో ఏమేరకు వుంటాడో, చందన్ బాహ్య ప్రపంచంలో ఆమేరకు వుంటాడు. కాని ఈ పాత్రల భేదం కూడా నవలలో స్పష్టంగా ప్రతిబింబించ లేదు. కేవలం అప్సర వివాహమే నవలా వాస్తవికత.

'అలకా' అనే నవలలో గ్రామీణ వాతావరణం వుంది - రైతులను కొల్లగొట్టే వాస్తవికత కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. నవల మొదట్లోనే దేశకాల పరిస్థితిని స్పష్టంగా ఇలా సూచిస్తాడు నిరాలా -

''ప్రపంచయుద్ధం పరిసమాప్తమయింది. భారతదేశంలో మహమ్మారి వ్యాపించివుంది. ప్రపంచ యుద్ధపు విషపూరిత వాయువులు ఆకస్మాత్తుగా భారతదేశాన్ని ఇంట్లో పొగలాగ కమ్ముకున్నాయి.''

దీంట్లో వర్గపోరాటపు ఆర్థిక చక్రం స్పష్టం. అలాగే సామాజిక జీవిత ఆచారాలు, విశ్వాసాలూ, అజిత్, విజయ్‌ల ఎదుట గ్రామవాస్తవికత వుంది. కాంగ్రెసు, రైతు సంఘం - ఈ వాస్తవాలున్నాయి. కాని అన్ని వైపుల నుంచి మన దృష్టి శోభ, అంటే అలక వైపే మరలుతుంది. శ్రమ దోపిడికి బలవుతున్న రైతులు ప్రజాపోరాటంలో ముందుకొస్తారు. దీన్ని చాలాచోట్ల చూపించడం జరిగింది.

''ఇతడు సురాజ్యం కోసం నాయకునిలా కార్యనిమగ్నుడైనాడు, ప్రభుత్వమూ, జమీందారు అనే రెండు బండల మధ్య పడి నలగడానికి భయపడటం లేదు. తన లైను వెంబడే జనాన్ని తీసుకెళ్లేందుకు అవుదూడలాగ తిరుగుతాడు, ఆ భగవంతునికి తెలియాలి ఇతనికి వార్తలెలా తెలుస్తాయో. ఇపుడు ప్రజలు పన్ను కట్టాల్సిన పని లేదట, రోజంతా ఈ పనిలోనే నిమగ్నమై ఉన్నాడు.''

'చిగురుటాకులు' అనే సంపుటిలోని కవితల వాస్తవికతావాదం యాదృచ్ఛికం కాదు అనే అభిప్రాయం వుంది. నిరాలా రాసిన రొమాంటిక్ అన్పించే ఆతని మొదటి కథాకావ్యల్లో అందం వుండనే వుంది. 'అలకా' లాంటి నవలల్లో వాస్తవికతావాదపు రూపు రేఖలన్నీ స్పష్టంగా లేవనేది నిజమే. కాని, కొన్ని సంకేతాలు మనం గుర్తించాలి - నిజయ్‌లాంటి పాత్రలు కొంచెం ప్రోత్సహిస్తే పీడిత జనం ఆత్మకు అంతరంగ బలం చేకూరుతుంది - నిరాలా దీన్ని సూచిస్తాడు. పాలక వర్గాలకు సహించని విషయాలేమిటంటే పూర్వంలాగా రైతులు భయపడక పోవటం; నవల చివరిలో అలక మురళీధర్ రాజాను హత్య చేస్తుంది. ఈ సాహసం ఆమె వ్యక్తిత్వం నుంచి వచ్చిందే.

'మోదుగు దేహంలోని కొమ్మ
కప్పబడింది పుష్ప పరాగంతో.''

ఈ సౌందర్యమున్నచోటే, ఈ సరికొత్త సాహసం కూడా వుంది.

'నిరుపమ'లో కుమార్ లండన్ నుంచి డి.లిట్. పట్టా పొంది దేశం తిరిగి వస్తాడు కాని, ఉద్యోగం దొరికే పరిస్థితి లేదు - బెంగాల్ యువతి నిరుపమ ప్రేమ లభిస్తుంది. దీంతో తన ప్రత్యర్థి అయిన యామినీ హరణ్‌ను ఓడించ గలగుతాడు. నిరుపమ జమీందారు కుటుంబానికి చెందింది-కుమార్ అదే జమీందారీలో వుంటాడు-కానీ, వీరిద్దరి పరిచయం వల్ల ఉత్పన్నమయ్యే ఏ స్థూల సమస్యకూడా నవలలో పొటమరించదు, ప్రస్తావనకు రాదు.

'ప్రభావతి' ఒక చారిత్రక నవల. ఇది పృథ్వీరాజ్-జయచంద్రల కాలం నాటి ఉత్తర భారత రాజుల అంతర్యుద్ధాల పై కేంద్రితం. ఇందులో ప్రభావతి లాంటి తరుణులు నైతిక కట్టుబాట్లు కోసం ప్రాణమైనా త్యజించాలనే తలంపు గల్గిన వాళ్లు ఉన్నారు. నవయుగ నారీ జాగృతి కూడా ఈ చైతన్యం వెనుక పని చేస్తుంది.

'చోటీకీ పకడ్' నవలలో నిరాలా స్వదేశీ ఉద్యమాన్ని కథగా చెప్పారు. ఈ నవలలో రాజులున్నారు. ఫ్యూడల్ వాతావరణంలో వ్యాపించిన భయము, కుట్ర, కూహకం, రహస్య

సభలు, అవమానం, చిత్రహింసల అనుభవాలు, సందేహాలు, రహస్యాలు-వీటన్నిటి విషాదాత్మక అనుభవాల చిత్రణ ఈ నవలను చదివింపచేస్తుంది - కథలో చిక్కుముడి వుండినప్పటకీ. విషాదాంత భావనను అనేక రూపాల్లో అనేక స్థాయిల్లో వ్యక్తం చేసే ఈ నవలను 'ఫాంటసీ' అన్నారు. నవలలోనే ఈ విషాదాన్ని సూచించాడు నిరాలా.

''ఎక్కడి నుంచి కూడా విముక్తి లేదు ఎంతవరకు దృష్టి పోతుందో, ఈ వలే వేసివుంది.

ఆశ పడే అన్ని వస్తువులూ రక్తసిక్తమే''

మిల్లు యజమానులు జమీందారుల్లాగానే ఉద్యమాల్లో పాల్గొనడం లేదు. ఇది ప్రభాకర్ గమనిస్తాడు. వాళ్ల దళారులు, అడ్డంకులు కలగజేసే వాళ్లు. సర్కారు మీద వ్యాపారస్తుల ప్రభావం కూడా వుంది. ఈ విషయంలో గమనించాల్సిన మరో సంగతి ఏమిటంటే, ఫ్యూడల్ వర్గంలోని కొందరు ఆత్మావలోకనం చేసుకోవడం మొదలయింది. ఉద్యమం తమ మంచి కోసమేనని గ్రహించేందుకు ఇది వారికి ప్రేరణ ఇచ్చింది

'చోటీకీ పకడ్' అసంపూర్ణ నవల. నిరాలా దీన్ని చాలా భాగాలుగా రాయాలనుకొన్నాడు. కాని, ఆరోగ్యం క్షీణించడం వల్ల అలా చేయలేక పోయాడు.

'కాలే కార్‌నామే' - (పాపపు పనులు) అనే నవలలో పల్లె వాతావరణం బాగా వుంది. కాని నవల అల్లిక చెదురుమదురుగా భయాందోళనల ప్రభావం కలిగిస్తుంది పోలీసుల దౌర్జన్యం ఈ పల్లె వాతావరణంలో అత్యంత గర్హనీయం.

''ఇంట్లో విషాద వాతావరణం అలముకొంది. వెక్కివెక్కి ఏడుస్తున్నా, ఎవరి నోటా మాట రాలేదు. రాత్రి అన్నం సాయంత్రమే తినే వాళ్లు - దీపం నూనె ఖర్చు మిగులుతుందని పిల్లలు నిద్రపోయారు. ఆడవాళ్లు శ్మశానంలా మెల్కొని వున్నారు.''

ఈ వర్ణనలో భయకంపిత వాతావరణం వుంది. ఒక ప్రత్యేక భయానక సమయానికి, వాతావరణానికి సంబంధించిన వాస్తవ దృశ్యమిది. ఈ నవలలో పల్లె వినాశనం చిత్రించబడింది. గ్రామంలో నిజంగా భయామహా వాతావరణం నెలకొని వుంది. పూర్తి వాతావరణం భయంతో మూర్తీభవించింది. ఏమికానుందో ఎవరికీ తెలియదు. కాని, జీవితం వ్యక్తం అయ్యేలా, వాస్తవ ప్రకృతి చిత్రణతో మొదలవుతుంది నవల.

''శ్రావణ మాసం విందు చేస్తోంది

కళ్లకు జొన్న, కంది. మినుము, గోగు, మొక్కజొన్న, వరి పంటలు పచ్చగా

కళకళలాడుతున్నాయి పక్షుల రెక్కలు తడిసి వున్నాయి. రెక్కలు విదిలించి నీరు దులుపుకుంటున్నాయి. ఇంపుగా కూస్తున్నాయి, ఒక చెట్టునుంచి మరో చెట్టు పైకి ఎగిరి పోతున్నాయి, మిడతలు పురుగులను వేటాడుతున్నాయి ఒకిరి పిట్టలు, గోరింకలు, కోయిలలు, చాతక పక్షులు, పావురాలు వర్షాకాలంలో కొంగ జాతికి చెందిన అనేక రకాల పక్షులూ చెరువు గట్టున వుండే ఎత్తైన - రావి, చింత చెట్ల పై గూళ్లు కట్టుకొని వున్నాయి. పిల్లలు గోదాలోకి దూకుతున్నారు. స్త్రీలు పనిమీద ఇంట్లోకి, బయటికి వస్తూపోతున్నారు. పల్లెలో ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. బాలికలు ఊయలలూగుతున్నారు. వర్షగీతాలు, విరహ గీతాలు పాడుతున్నారు. పురుషులు భుజాల పై వాసాలు మోస్తూ, పొగాకు కొట్టుకుంటూ అటూ ఇటూ తిరుగుతున్నారు. ఇది జీవనదాయక హర్షోల్లాస చిత్రం. ఇందులో వేగం వుంది. స్ఫూర్తి వుంది. ఇది నిరాలా రాసిన 'అనామిక' లోని 'ఖులా ఆస్మాన్' కవితలో వ్యక్తమయింది -

''చాలా రోజులకు తెరిపిచ్చింది
ఎండ కాసింది, ప్రపంచం సంతసించింది
దిక్కులన్ని కన్పించాయి, ఒక్కసారి తళుక్కుమనె చెట్లు
మేనేందుకు వెళ్లాయి ఆవులు, గేదెలు, గొర్రెలు
మగపిల్లలు ఆడసాగారు సరసాలు
ఆడపిల్లలు గృహాల్ని నింపసాగారు వెలుగుతో''

'పాపపు పనులు' అనే నవలలో నెమ్మది నెమ్మదిగా జీవిత దృశ్యం పై విషాద భావం, ఓటమి, నిరాశ, మౌనభావం కన్పిస్తాయి. రహస్యం, సంశయము, కుట్రలూ, కలహాలు, స్వార్థంకోసం పోరాటాలు, వీటిని అస్థిర పరచే పరిస్థితులు లేవు-అయినా చివరిలో కొద్దిగా అన్పిస్తుంది ఇది సంభవమేమో అని.

''ఆతనికి భయం లేదు, జనం ఆతణ్ణి అక్కడ వుండకుండా చేశారు. కాని శిరస్సు పగలకొట్టి విరిగే వజ్రంలా వున్నాడు ఆతడు ఆతడు మా పిలుపు, అశ్రువులతో బొట్టుబొట్టుగా కారుతూ ఆవిరియై పైకెగురుతాడు - ఎపుడో ఒకప్పుడు సంతోషపు వానజల్లు కురిపిస్తాడు '' ఈ పంక్తులు చదివితే ముక్తిబోధ్ గుర్తొస్తాడు! 'భూల్ గల్తీ' లోని ఈ పంక్తులు స్మరణ కొస్తాయి - మా ఓటమికి ప్రతీకారం తీర్చుకోవాలని వస్తాడు.సంకల్ప స్వభావ చైతన్యపు రక్తప్లావిత స్వరం/మన హృదయ రహస్య స్వర్ణాక్షరం/ప్రత్యక్షమయి విక్ష త రూపం ధరిస్తాడు.'

'పాపపు పనులు' (కాలేకార్‌నామే) నవల కూడా నిరాలా అసంపూర్ణ నవల.

మనోహర్ పల్లె విడిచి వెళ్లిపోతాడు - ఆతడు తిరిగి వస్తాడనే ఆశ లేదు-సమస్యలన్నీ అలానే అపరిష్కృతంగా వున్నాయి. ఈ వస్తుగత యథార్థానికి ఏదైనా కాల్పనిక పరిణతి చూపించే ప్రయత్నం చేయలేదు నిరాలా.

'కుల్లీభాట్', 'బిల్లేసుర్ బక్‌రిహా' నవలల్ని నిరాలా నవలా సాహిత్యంలో గొప్ప నవలలని మనం చెప్పుకోవచ్చు. హాస్యం-వ్యంగ్యం, కటువైన వాస్తవికత–ఈ రెండింటి మార్మిక రచనా దృష్టితో చూస్తే ఈ నవలలు భారతీయ కథా సాహిత్య చరిత్రలో అద్వితీయం.

'కుల్లీభాట్' నవల కుల్లీ జీవిత చరిత్రమాత్రమే కాదు, నిరాలా ఆత్మకథ కూడాను. నవలా రూపంలో వున్న 'స్వీయచరిత్ర' లేక 'జీవితచరిత్ర' మాత్రమే కాకుండా, వీటిలో 'సంస్మరణ', 'రేఖాచిత్రం' లాంటి అనేక ప్రక్రియలు అంతర్భాగాలు. అతి సామాన్యమైన, మానవ సహజమైన బలహీనతలు-అంతర్వైరుధ్యాలతో నిండిన పాత్ర కుల్లీ. ఈ పాత్రలో నిరాలా చూపిన ప్రత్యేకత వెనుక నూతన సామాజికత, నూతన నైతికత గురించిన రచయిత అవగాహన వుంది.

గుర్రపుబండి తోలేవాడిగా కుల్లీ మనకు మొదట పరిచయమవుతాడు. కుల్లీతో సంబంధాలు పెట్టుకోవద్దని నిరాలాకు ముందుగానే అత్తవారింటిలోనే చెప్పడం జరిగింది. అర్ధనిక్షిప్త దశలో కూడా కుల్లీని ఎందుకు బహిష్కరిస్తున్నారు అని ప్రశ్నిస్తాడు నిరాలా. కొంతకాలం తర్వాత కుల్లీకి లైంగిక వికృతి వుందనే రహస్యం బయటపడుతుంది.

ఒక రోజు కుల్లీ నడవడికలో కొత్తరూపం బయటపడుతుంది. ఆతనిపుడు స్వాతంత్ర్యోద్యమంలో క్రియాశీల పాత్ర నిర్వహిస్తుంటాడు. - కాంగ్రెస్ కార్యకర్త అవుతాడు. - అస్పృశ్యుల సేవలో నిమగ్నమౌతాడు. ఆచారాల్ని అవహేళన చేస్తాడు. ఆతను ముస్లిం మహిళని వివాహం చేసుకుంటాడు, స్త్రీని ఎలా గౌరవించాలో ఆతనికి తెలుసు. ఇక్కడ నిరాలా తన వివాహ విశేషాలు రాసి మనోహరాదేవితో తన సంబంధాల మనోవైజ్ఞానిక సమీక్ష చేస్తూ పోతాడు. తన అహంకారం, వ్యక్తిత్వం-వీటికి సంబంధించిన సమస్యల్ని, చిక్కుల్ని నిరాలా స్వీకరిస్తాడు. నిరాలా కుల్లీని పరిహసిస్తాడు. తనను కూడా పరిహసించుకుంటాడు. ఇక్కడ నిరాలా కుల్లీ వ్యక్తిత్వం ఎలా పరిణతి చెందిందో చెబుతాడు. తన సొంత వ్యక్తిత్వం గురించి కూడా చెబుతాడు. బెంగాల్‌లో హిందీ నేర్చుకొనేందుకు తాను చేసిన ప్రయత్నాల కథ కూడా చెబుతాడు.కుల్లీ వ్యక్తిత్వంతో పూర్తిగా మమేకమై ఈ కథ చెప్పడంలో నిరాలా నిమగ్నమౌతాడు. కానీ కుల్లీ మృత్యువుతో నిరాలా బాగా కలత చెందుతాడు. అతను సాహసంతో, ఆత్మీయతతో కుల్లీకి దివసం చేస్తాడు. ఒక సామాన్యుడు, చూస్తుండగానే, ఇంత అసాధారణమైన వ్యక్తిగా మారడం నిరాలాకు నచ్చుతుంది.

హాస్యధోరణి ప్రధానమైన ఈ నవలలో చాలాకాలం వరకు మనసును ప్రభావితం చేసే అనుభూతి కూడా నిక్షిప్తమై వుంది. హాస్యప్రధాన పరిస్థితుల మధ్య మానవత్వపు బాధామయ అవగాహన నవల కేంద్రబిందువు. ఉపోద్ఘాతంలో నిరాలా రాయనే రాశాడు - 'అన్నిటికంటే ముందు కుల్లీ ఒక మనిషి - మనిషిగా ఎల్లప్పుడూ గౌరవింపబడే ఒక మనిషి' - 'కుల్లీభాట్'లో సమస్యల కాల్పనిక పరిష్కారం కన్పించదు. వాస్తవికత, కల్పనల మధ్య ఏ అంతర్ వైరుధ్యమూ లేదు. ప్రేమ్‌చంద్ నవలలతో నిరాలా నవలల వాస్తవికతను పోల్చి చూచినట్లయితే అది హిందీలో జాతీయ వాస్తవికతావాద కథా సంప్రదాయపు పునాదిని తెలుసుకోవడానికి ఉపకరిస్తుంది.

'బిల్లేసుర్ బకరిహా' అనే నవల కథాసంవిధానం స్కెచ్‌కి దగ్గరగా వుంటుంది ఇందులో నిరాలా తనను తాను మరచిపోయి, బిల్లేసుర్ అనబడే మామూలు రైతు జీవనపోరాటంపై దృష్టిని కేంద్రీకరిస్తాడు. ఈ నవలను నిరాలా, 'అభ్యుదయ సాహిత్యానికి ఉదాహరణ' అని పేర్కొనేవాడు ఇందులో 'బాహ్య' చిత్రణ పైనే ఆంతరిక చిత్రణ ఆధారపడింది అనేవాడు.

బిల్లేసుర్ బ్రాహ్మణ కులస్తుడు, 'తరీ' సుకుల్ శాఖవాడు, కాని ఈ 'సుకుల్'కు ప్రపంచాన్ని ఎలా ఎదుర్కోవాలో తెలీనపుడు మేకలు మేపే పని దొరికింది. మరి, ఇది చూసి పల్లెప్రజలు, సహజంగానే వినోదప్రియులు కాబట్టి ఇతని పేరే పెట్టేశారు - 'బిల్లేసుర్ బకరిహా' అని. ఇది తర్వాత ఘటన. మొదట్లో రోజులు గడవడం కష్టమయినపుడు బిల్లేసుర్ బర్ద్వాన్ చేరతాడు అక్కడి మహారాజు దగ్గర సత్తీదీన్ సుకుల్ జమాదార్ (హెడ్ కానిస్టేబుల్) - మరి ఉద్యోగమా? ఆ జాబులిచ్చే నౌకరి దొరుకుతుంది. జమీందార్ శ్రీమతి అతనితో అన్నిపనులూ చేయించేది. ఇదికాక, ఆమె సంధించే వ్యంగ్య బాణాలు అదనం. దుఃఖాలు సహిస్తూ పోవడం బిల్లేసుర్‌కు అలవాటయింది. సత్తీదీన్ భార్యకు సంతానం లేదనే బాధ వుంది. ఆమె జగన్నాథ్ ఆలయానికి పోవాలనుకుంటుంది. బిల్లేసుర్ కూడా పోవాల్సివస్తుంది. సత్తీదీన్ సంతుష్టుడైతే, తన నౌకరి ఖరారై పోతుంది. కల వచ్చిందని అబద్ధం చెప్పి సత్తీదీన్‌తో గాయత్రి మంత్రం చెప్పించుకుంటాడు. దీంతో ఏమీ లాభం లేకపోవడంతో-ఒక సంవత్సరం పైగా సాధన చేసినా - గురుపత్ని వాస్తవికత బాధాకరమౌతుంది. బిల్లేసుర్ పూసలదండ పారేసి వూరు చేరుతాడు మేకలు పెంచుకోవడం అనే తన ఆలోచనను సమర్థించేందుకు ఒక సరళమైన తర్కం లేవదీస్తాడు.

''అవసరమయినపుడు బ్రాహ్మణులు నాగలి పట్టాల్సి వస్తుంది, చెప్పుల షాపు పెట్టాల్సి వస్తుంది, మరి వాటితో పోల్చితే మేకలు మేపడం ఏం చెడ్డ పని? అంట''.

బిల్లేసుర్ వూరు తిరిగి వచ్చి ఎక్కడ వుంటాడో దాని స్వరూపం కాస్త వర్ణిస్తూ నిరాలా అంటాడు -

''ఇంటి కెదురుగా ఒక పాడు నుయ్యి, చింతచెట్టు. వర్షం వల్ల గోడలు తడిసి మిట్టవల్లాలుగా మారినాయి. గోడలనుండే మురికి కాలువలు బయలుదేరాయేమో అన్నట్లుగా వుంది. లోపలి మురికి కాల్వ నిండినందు వల్ల వర్షపు నీరు గడప కింద గుంట చేసి పారుతోంది. గుంట పెద్దదై కుక్కల్లాంటి జంతువులు సులభంగా దానిలోంచి పోగలుగుతున్నాయి. గడప దగ్గర గచ్చునేల ఎక్కడా సమంగా లేదు: దానిపై పడుకోవడ అలా వుంచి, మంచం కూడా వేసుకునే స్థితి లేదు.''

పల్లెల్లో ఉండటం అంటే శత్రువుల కోటలో వున్నట్లే. ఇదీ ఆ గ్రామ పరిసరాల భయంకరమైన వాస్తవం, బిల్లేసుర్ ఎదుర్కొనే వాస్తవం. కాని బిల్లేసుర్‌కు మరో మనసుంది. ఈ దారిద్ర్యంలోనే బంగారు బిస్కట్లు దాచిపెట్టుకున్నాడు అని భ్రమ కల్గిస్తున్నాడు బిల్లేసుర్. వివాహం చేసుకోవాలని ఉబలాటపడుతున్నాడు. పెళ్లికూతురు రూపం మనసులో మెదుల్తూనే ఎన్నో మొగ్గలు ఒక్కసారిగా వికసించాయి. నిరాలా రాస్తాడు - ''మన సోక్రటీసుకు నోట మాట లేదు కాని అతని తాత్వికత బలమైనది - ఆ దాన్నెవ్వరూ పట్టించుకోరు, మరి''.

కొంతమంది ఒక రోజు జమీందారుతో బిల్లేసుర్‌కు వ్యతిరేకంగా ఫిర్యాదు చేస్తారు. 'బిల్లేసుర్ పల్లెలోని చెట్లన్నీ బోడి చేశాడు. కాబట్టి అతని మేకల్ని అమ్మేయించాలి అని. బిల్లేసుర్ ఒక రోజు హనుమంతుని ప్రార్థిస్తాడు మేకల్ని రక్షించమని. చిలగడదుంపలు (గెనుసుగడ్డలు) నాటేచేనిలో వుంటూ దీని వల్ల కలిగే లాభాన్ని గురించి వూహిస్తాడు-బిల్లేసుర్. అపుడే అతని మేకపోతు ఒకటి చనిపోతుంది. హనిమంతునిపై అతనికున్న భక్తి క్షణంలో బూడిదవుతుంది ఆలయంలో వ్యతిరేకదిశలో ప్రదక్షిణ చేసి హనుమంతుని దగ్గరకు పోతాడు. ఉద్రేకంతో అంటాడు - 'చూడు, నేను పేదోణ్ణి. నిన్ను అందరూ దీనజనోద్ధారకుడు అంటారు. - అందుకే నేను నీ దగ్గరికి వచ్చాను. నా మేకల్నీ, మేకపిల్లల్నీ దయగా చూడు'. కాని, ఎంత బాగా రక్షించావయ్యా నువ్వు! చెప్పు, చిప్పలాంటి మోహమూ, నువ్వూ. జవాబు రాకపోవడంతో, హనుమంతుని మోహం మీద కర్రతో గట్టిగా కొడతాడు. మట్టితో చేసిన మోహం విరిగిపోయి చాల దూరంగ పడిపోతుంది.

సంప్రదాయం, ఆధునికతల ద్వంద్వాత్మకత నిరాలా రచనల్లో వున్నట్లు ఛాయావాద యుగంలో మరెక్కడా కన్పించదు. రామ్‌విలాస్ శర్మ 'బిల్లేసుర్ బకరిహా' ను 'రామ్‌కీ శక్తి-పూజ'కు ప్రత్యామ్నాయం అన్నాడు. (నిరాలా కీ సాహిత్య-సాధన-ద్వితీయ భాగం, పుట 479).

జిజీవిషే బిల్లేసుర్‌కు ఒక విధమైన నేతృత్వం సంతరించి పెడుతుంది మేకల్ని మేపుకోవడం వల్ల బతకడం కష్టమని తెలిసి బిల్లేసుర్ కొత్త పద్ధతిలో వ్యవసాయం చేయడం మొదలెడతాడు. జీవనసమరంలో పూర్తిగా నిమగ్నమౌతాడు. వివాహేచ్ఛ ఫలిస్తుంది. కాని అప్పటికే ఆతని లోపలిసారం ఇంకి పోయింది. వయస్సు మళ్లింది.

'బిల్లేసుర్ బకరిహా' నవల నాయకుడు తన పల్లెటూరి వాతావరణంలోని అశాంతిని అనుభవిస్తాడు కాని, తన ఈ వెర్రిలో కూడా ఆతను బయటి వ్యక్తి (పరాయివాడు) అయిపోడు. ఆతని జీవనశక్తే ఆతణ్ని పరిసరాలతో మమేకం అయ్యేట్లు చేసింది. జీవితం గడపడం కష్టమనిపించే పరిస్థితులున్నా, ఆ పరిస్థితుల్లోనే జీవితాన్ని జీవించదగిందిగా చేసుకుంటాడు బిల్లేసుర్. క్రూర విషాదాన్ని కూడా వినోదంగా పరిగణించే ఈ కథానాయకునికి తనదంటూ ఒక వేదాంతముంది. జీవితం పట్ల గట్టి నమ్మకం వున్నందువల్ల దేవుని ఉనికి అవసరమయింది. దుఃఖమే బిల్లేసుర్ దైవం. దుఃఖంలో వుండడమనే కళను బాగా ఆకళింపు చేసుకున్నాడు బిల్లేసుర్. ప్రకృతినీ జీవితాన్నీ ఆతను స్పష్టంగా చూస్తాడు. చింతచెట్టు మీద పక్షులు కలకల ధ్వని చేస్తున్నాయి; బిల్లేసుర్ చూస్తాడు. బిల్లేసుర్ జీవనఘటనల్ని నిరాలా పరిపక్వ దృష్టితో చూస్తాడు

''కొంచెం కొంచెం చలి. మంచు పడతా వుంది. చలికాలమంతా పక్షులు చింతచెట్టు చిటారు కొమ్మలపై గూళ్లు కట్టుకో నారంభించాయి. పక్షుల కలరవం మరింత పెరిగింది. బిల్లేసుర్ రాత్రిపూట అరుగుపై కూర్చొని చూస్తుండేవాడు. పూర్వం సాయంకాలం ఆకాశాన లేడి కన్పించిన చోట ఇపుడది కన్పించడం లేదు.''

దుఃఖమతిశయించినా బిల్లేసుర్‌కు వివాహేచ్ఛ కలిగితే మనసు ఉల్లాసం చెందుతుంది. ''వివాహలత మొగ్గ తొడగటం మొదలెట్టింది, పనిచేస్తూ చేస్తూ ఉద్విగ్నుడవుతాడు, శ్వాస ఆగినంత పనవుతుంది. రోమాలు నిక్కపొడుచుకుంటాయి.''

నిరాలా బిల్లేసుర్ కార్యకలాపాలపై కన్నేసి వుంచుతాడు - లోలోపల నవ్వుకుంటాడు-క ని సహానుభూతి కూడ చూపిస్తాడు. 'పూజ చేసే సమయాన అద్దంలోకి చాలసార్లు చూసుకుంటాడు, కళ్లు, కనుబొమలు ఎక్కించి తగ్గించి, బుగ్గలు ఉబ్బించి, సొట్టలు పడేట్టుచేసి, పెదవులు సాగించి చూసుకుంటాడు'' ఈ మనస్థితిలో బిల్లేసుర్ ఇంటి నుంచి బయలుదేరుతాడు. చిరపరిచిత ప్రకృతి కూడా కొత్తగా సాధారణంగా కన్పిస్తుంది.

''ఒకచోట, కొన్ని ఖర్జూరపు చెట్లూ, తాటిచెట్లూ కన్పించాయి. ఎదురుగా పచ్చని పైరు రెపరెపలాడుతూ వుంది. మంచు కురుస్తోంది. సూర్యుని కిరణాలు పడుతున్నాయి.

క్షళ్లపై రకరకాల రంగులు పడుతున్నాయి. ... మామిడి, ఇప్పచెట్లు, కచ్చా రహదారిపై వరుసగా వున్నాయి. చలికాలపు ఎండ చక్కగా, బంగరుకాంతి విరజిమ్ముతోంది. ప్రపంచమంతా బంగరు కాంతితో శోభిల్లుతోంది. పేదరికం ప్రభాహీనమయింది. చిన్న, పెద్ద, అన్ని చెట్లపై పడే ఋతు ప్రభావం ఆతని పై కూడా పడుతోంది. సానుకూలంగా వీచే గాలితో బిగుసుకున్న తెరచాపలా తన లక్ష్యం వైపు బిల్లేసుర్ నడిచి పోతున్నాడు. ఈ పనిలో ఆతనికి అంతా లాభాల మయమే, నిశ్చయంగా నలువైపులా పచ్చదనమే... కనుచూపు మేరా గాలితో వూగే ఆ పచ్చదనం అలలే కన్పిస్తున్నాయి. వాటితో హృదయం కలిసిపోతుంది, వాటి లాగానే అదీ డోలాయమానమౌతోంది.''

ఈ నవలలో పూర్వపు కాల్పనికతా ప్రధాన నవలల్లో కన్పించే ప్రకృతికి సంబంధించిన ఆలంకారిక వర్ణనలు లేవు. కాని, ప్రకృతి యొక్క ఈ యథార్థ చిత్రణలో జీవనం స్పష్టంగా చిత్రీకరించబడింది. ఇచట ప్రకృతి, మనుష్యుల మధ్య లోతైన ఆత్మీయ సంబంధం కన్పిస్తుంది - అనుభూతుల నిష్కపటత్వం కన్పిస్తుంది.

నిరాలాను హిందీ వచన సాహిత్యంలో వాస్తవికతావాద సంస్థాపకులుగా చూడవచ్చు. కవిత్వంలో ఆయన ఒక నవ్య వాస్తవికతావాదాన్ని ఆవిష్కరించాడు, అదేవిధంగా తన కథలూ, నవలల్లో వాస్తవికతావాద గద్యం రాశాడు. ఇది సామాన్య ఆలంకారిక భాష కంటే బలమైన భాష. ఈ అర్థంలోనే నిరాలాకు వచనం జీవిత సంగ్రామ భాష. హాస్యం, వ్యంగ్యం, వినోదం నిరాలా వచనం యొక్క సహజ సంస్కారాలు. హిందీ మాట్లాడే ప్రజల జీవితంలో వినోద ప్రియత్వం సహజంగానే వ్యాపించి వుంది, కాని హిందీ సాహిత్యంలో హాస్యం కరువైంది. ఇది అసంగతమని నిరాలా భావించేవాడు. అవధ దేశపు గ్రామీణ ప్రాంతంలోని రైతుల పాత్రల అధ్యయనంతో నిరాలా ఒక నిశ్చితాభిప్రాయినికి వస్తాడు. నిషాదాత్మక వాస్తవికతలో జీవించేందుకు వినోద స్వభావం అంతరంగంలో (ఆత్మకు) బలాన్ని ఇస్తుంది. లోతైన బాధ, హాస్య వినోదాల మధ్య సమతౌల్యం నిరాలా రచనల్లో కన్పించినంతగా వేరెక్కడా కన్పించదు. జీవితాన్ని దర్శించే ఈ పద్ధతి, ఈ కళ ప్రపంచంలోని గొప్ప వాస్తవికతావాద రచయితల్లోనే చూడగలుగుతాము. నిరాలా కూడా ఈ కోవకు చెందిన వాడే.

# 9. సంస్కృతిని గురించిన చర్చ

విమర్శను సాహిత్యపు మస్తిష్కమని పేర్కొంటాడు నిరాలా. కాని ఆయన పేర్కొనే విమర్శ కేవలం సాహితీ విమర్శ కాదు. ఆయన నిరంతరం సంస్కృతిని గురించిన చర్చ చేస్తూ వచ్చాడు. ఈ చర్చలో కూడా ఆయన స్వేచ్ఛాజీవే. తను చేసిన అనేక వ్యాఖ్యలలో, వ్యాసాల్లో నిరాలా సామ్రాజ్యవాద ఆర్థిక విధానం, దాని మోసపూరిత చర్యల్ని, ఇంగ్లండు, భారతదేశాల మధ్య సంబంధాలపై విశ్లేషిస్తాడు. సామ్రాజ్యవాదం, భూస్వామ్య విధానం, పెట్టుబడీదారీ విధానాల మధ్య వుండే విప్లవాత్మక మార్పుల గురించి సమీక్షిస్తాడు సంస్కృతిని గురించిన ఆయన ఆలోచనలో సమాజం, రాజనీతి, మతం, తత్వశాస్త్రం, విజ్ఞానం - ఈ అన్ని విషయాలూ వస్తాయి. నూతన రక్తసంచారంలా కొంగ్రొత్త ఆలోచనల రాకపోకలు సాహిత్యం లోనూ, సమాజంలోనూ వున్నప్పుడే సాహిత్యం బతుకుతుంది అని నమ్ముతాడు నిరాలా. ఒక్క ప్రేంచంద్ తప్ప హిందీ సాహిత్యంలో మరెవ్వరూ సంస్కృతిని గురించి నిరాలాలాగ చర్చించి వుండరు. ఈ చర్చాక్రమం ఆయన కవితల్లో, కథల్లో, నవలల్లో, విమర్శనాత్మక ఆలోచనల్లోనూ-సంపాదకీయ వ్యాఖ్యల్లోనూ-అంతటా విస్తరించి వుంది.

వ్యాసాలు, వ్యాఖ్యల ద్వారా నిరాలా బ్రిటిషు సంస్కరణలకూ వాళ్ల దమనకాండకూ వ్యతిరేకంగా జనాన్ని సంఘటితపరచడం, ప్రత్యేకించి రైతుల్ని సంఘటిత పరచాల్సిన అవసరాన్ని గురించి చెబుతాడు. క్రాంతి, విప్లవాల గురించిన ఆయన భావన కేవలం వూహాజనితం కాదు. ప్రత్యేకించి మన దేశ చరిత్రా, సంస్కృతిపై బ్రిటిషువాళ్ల ఆక్రమణ జరిగిందని నిరాలా భావిస్తాడు. అందువల్ల ఆయన భారతీయ సమాజం అంతర్

వైరుధ్యాలను విమర్శిస్తూ, రైతులు, స్త్రీల హక్కులపై పడుతున్న వేటును వ్యతిరేకిస్తూ కులవ్యవస్థ వల్ల జరిగిన సామాజిక విభజనను చీల్చి చెండాడాడు. భూస్వామ్య సంస్కృతిలోని అవరోధాలను విమర్శిస్తూ స్వాతంత్ర్య మౌలిక ఆశయాలను పరిపుష్టం చేయాలనుకుంటాడు నిరాలా.

భారతీయ సాంస్కృతిక సమైక్యత, అఖండతలోనే భారతీయ సమాజ 'విముక్తి' ఉందంటాడు నిరాలా. నిరాలా దృష్టిలో హిందూ ముస్లిమ్ సమస్య పరాధీన భారత ప్రధాన సమస్య. 1930లో సహజ వ్యవస్థపై రాస్తూ నిరాలా ఈ సమస్యను విశ్లేషిస్తాడు -

''వర్తమాన సామాజిక స్థితిలో ఈ హిందూ-ముస్లిం సమస్య చిక్కువీడదు. ఓ కొత్త సమాజం రూపొందితేగాని, ఈ సమస్యకు పరిష్కారం దొరకదు. మొదట్లో ముసల్మానులు ఇక్కడికి వచ్చినపుడు వాళ్ల కులశీలాలు తెలియకపోవడం వల్ల వారి మతపరమైన, సామాజికపరమైన కార్యకలాపాల్లో ఇక్కడి వాళ్లు సహాయ నిరాకరణం చూపారు. అది సబబే. కాని, ఇపుడు అలా చేస్తే సమాజానికి ఏ మాత్రం హితం కాదు. వాళ్లిపుడు ఈ దేశపు మనుషులే.''

ఈ సందర్భంగానే, హిందువుల సర్వోన్నత వేదాంత తత్వం వ్యక్తిగతం కాదని నిరాలా గట్టిగా చెబుతాడు. 'ముసల్మానులు-హిందూ కవుల మధ్య ఆలోచనా సామ్యం' అనే ఒక వ్యాసంలో ఉన్నత స్థాయిలో హిందువులూ ముస్లిములూ ఒకే విషయం చెబుతారు, అని అంటూ గాలిబ్‌లో వేదాంతం చూస్తాడు నిరాలా -

ఏమీ లేనపుడు దేవుడుండినాడు
ఏమీ వుండకపోతే దేవుడుంటాడు
నా ఉనికే నన్ను ముంచింది
నేనుండకపోతే ఏమై వుండేది మరి.

ఈ వేదాంతపు భావ పునాది మీద తులసీదాసు గాలిబ్‌తో పాటు కన్పిస్తారు. గాలిబ్ సూరదాసుల మధ్య సామ్యం కన్పిస్తుంది నిరాలాకు. వంగ సాహితీ సాంస్కృతిక ప్రగతికి నేపథ్యం వేదాంతప్రేరణే అంటాడు నిరాలా. వేదాంతాన్ని ఆయన స్వతంత్ర జ్ఞానం అంటాడు. మానవత్వపు విముక్తికీ, భౌతిక వాస్తవికతకు బీజాలు భారతీయ వేదాంతంలోనే వున్నాయి అంటాడు. తన వ్యాసాల్లో నిరాలా దేశీ సంస్థానాలలోని అంధకార జీవితాన్నీ, వాటిలోని దోపిడీతత్వాన్ని విశ్లేషిస్తూ ఆ వ్యవస్థలో ప్రజలుండేది పన్నులు కట్టడానికీ, ప్రభువులు సుఖాలు అనుభవించే దానికీ - ఇది అన్యాయం అంటాడు. అస్పృశ్యుల పక్షాన

రాస్తూ నిరాలా అంటాడు - ''అస్పృశ్యుల ఈ జ్ఞానం పెరుగుతూ పోతుంది. అలాగే, దీంతో సమాన హక్కులు వారు పొందగలుగుతారు తమ శక్తితోనే హిందువుల నుంచి అధికారం సాధించుకోగలుగుతారు. అపుడు భారత దేశ శక్తి తగినట్లుగా వృద్ధి చెందుతుంది.'' (సుధ, నవంబర్, 1932) 'నయేపత్తే' అనే కవితా సంపుటిలో ఈ మానవతే వ్యక్తమయింది.

కుమ్మరి సుంకన్న
కమ్మరి గంగన్న
మాదిగ నరిసిగాడు
నీళ్లు మోసే బోయోడు
అంతా ఎందుకు ఉరికినారు
ఏమీ కాలేదు ఏమీ కాలేదు
రంగు మారింది, సత్యం చెప్పేందుకు అంతా సన్నద్ధం అయినారు మరి.''

వేదాంత భావజాలం ఆదర్శ సమాజవాదం వైపు తప్పక దారి చూపిస్తుందనే గ్యారంటి ఏమీ లేదు. కాని, వాస్తవమేమిటంటే నిరాలా రైతు సంస్కారమే ఆతని వేదాంత భావాల్ని సమాజవాద సదాశయంతో సమన్వితం చేస్తుంది.

సాహితీ సంప్రదాయంతోనూ సమకాలీన రచనా సమస్యలతోనూ తలపడటం నిరాలా విమర్శనాత్మక ఆలోచనలోని మరో ప్రముఖ అంశం. చండీదాసు, విద్యాపతి, తులసీదాసు, గాలిబ్, రవీంద్రనాథ టాగోర్‌ల అనుభవ ప్రపంచంలో కళోపకరణాల నిర్మాణాత్మక విశ్లేషణ చేస్తాడు. విద్యాపతి, చండీదాసులను పోల్చుతూ నిరాలా అంటాడు - ''విద్యాపతి ఆలోచన దూరంగా పోతుంది. అన్ని కోణాల్లోనూ ఆతడు ఉత్తీర్ణుడు అవుతాడు. ఆతని సౌందర్య వర్ణనలు ఎంత రమ్యంగా వుంటాయో, భావుకత కూడ అంత ప్రబలంగా ఉంటుంది. చండీదాసులో భావుకత్వం పాలు ఎక్కువ. కవిశేఖరుడు విద్యాపతి కావ్యకళాకారుడు. శ్రీహర్షునిలా కాళిదాసులా భావుకుడు కూడా. కాని చండిదాసు కావ్యంలో శిల్పం కంటే భావుకత్వమే ప్రధానం. విద్యాపతి కవిత్వంలో సంగీతంతో పాటు అక్షర రమ్యత కూడా వుంది. చండీదాసు గేయాల్లో ఆవేశం అధికం, విద్యాపతిలో ఓపికతో కూడిన పరిశీలన ప్రధానం.''

నిరాలా చేసిన ఈ విశ్లేషణ వెనుక కళావివేచన కన్పిస్తుంది. 'నా గీతాలు-కళ' అనే వ్యాసంలో నిరాలా కళను నిర్వచిస్తూ ఇలా అంటాడు - ''కళ కేవలం అక్షరాలు, పదాలు, ఛందస్సు, అనుప్రాస, రసము, అలంకారము, ధ్వని సౌందర్యం కాదు. వీటన్నిటితో కూడిన

సౌందర్యం యొక్క సంపూర్ణత అది. పదిహేడేళ్ల సుందరి కళ్ల అందంలా, నిండైన దేహపు తరంగంలా హెచ్చుతూ తగ్గుతూ భిన్న వర్ణాల వాణిలో వెల్లడై క్రమంగా క్షీణించి మధుర తరమై లీనమై పోతుంది. కేవలం విత్తనం నుంచే పుష్పం యొక్క నిండు శోభ వ్యక్తం కాదు. వేళ్ల మొదలు, కొమ్మలు చివుళ్లు రంగు పుప్పొడి వాసన-ఇవన్నీ అవసరం-పువ్వు అనే 'కళ' పూర్తి కావాలంటే. అలాగే కావ్యకళకు సకల కావ్య లక్షణాలూ కావాలి. అందమైన చెట్టు, అంతటిలో మొదళ్ల గట్టిదనం కింద పూల వాసన ఎలా దాగివుంటుందో-అలాగే కావ్యకళ అవసరమైన 'అసుందర' అక్షర క్రమాన్ని తన మనోహర [illegible]ంలో దాచుకొని వుంటుంది.''

ఈ సుదీర్ఘ ఉదాహరణ ఎందుకు, అవసరం అయిందంటే భావకవితా సిద్ధాంతం అర్థం చేసుకోవడానికే నిరాలా కళావివేచన ఉపకరిస్తుందనే భ్రమ నుంచి మనం బయట పడాలి కనుక నిరాలా వాస్తవికతావాదం వెనుక కళా సమగ్రతా సూత్రం నిక్షిప్తమై వుంది కనుక.

నిరాలాకు తులసీ ఏమేరకు ఆదర్శమవుతాడో అనే దానికి ఒక ముఖ్యమైన ఉదాహరణ 'తులసీదాసు' అనే ప్రబంధ కావ్యం. 'రామ్ కీ శక్తి పూజా'లోని రాముడు, 'తులసీదాసు' లోని కావ్యనాయకుడు తులసీదాసు పాత్రలో వాస్తవంగా తననే చూసుకుంటూ తన పోరాటం, తన జ్ఞానాత్మక చైతన్యం లోతు తెలుసుకోవడం నిరాలా అభీష్టం. 'తులసీదాసు' పై రాస్తూ నిరాలా తన అంతరంగంలోకి చూస్తాడు, తన దేశకాలాల సంక్లిష్ట వాస్తవికతను కూడా తరచి చూస్తాడు.

''ఆ మానస-ఊర్ధ్వదేశంలో కూడ'
రాహుగ్రస్త రవి కిరణాల్లా
కాంతిని చూశాడు కవి-ఛాయా రూపంలో భారతదేశపు సమ్యక్ దేశ
కాలాలు.

తులసీదాసు రచనా పోరాట ధ్యేయం నిరాలా ధ్యేయం కూడా. ''దేశకాల బాణవేధితుడు/కవి మేల్కొన్నాడు అనంత కళాధరుడు/ఇతని కంఠంలో ప్రతిధ్వనిస్తుంది సరస్వతీదేవి!''

మరోచోట నజీర్ కవిత్వాన్ని ప్రశంసిస్తూ నిరాలా ఇలా భావిస్తాడు-నజీర్ హృదయ నయనం వికసించింది. ఆకు ఆకులో కొమ్మకొమ్మలో ఆత్మ వైభవం చూసి ముగ్ధులవుతున్నారు.

ఈ సందర్భంలో ఆతనికి తులసీదాసు భావించిన రాముని విశ్వరూపం స్మరణకొస్తుంది. భిన్నత్వంలో ఏకత్వం చూసే కబీరు గుర్తుకొస్తాడు. బాహ్యానామ సంకేతాలు వదలి నైరూప్య అస్తిత్వం నిరూపించే మీర్ గుర్తుకొస్తాడు -

ఇదేమిటి! అయ్యో ఎవిరికోసం
ప్రతిదాన్నుండి దూరమయ్యామో
వారే నన్ను స్వార్థరహితుణ్ణి చేసి,
నన్ను మీనుంచీ కూడ వేరు చేసి వెళ్లారు

నిరాలా ప్రకారం మీర్‌లో వెల్లడయ్యే ఈ అద్భుత వ్యంగ్యాత్మకతలో భావ రహస్యాలు నిబిడీకృతమై వున్నాయి. రవీంద్రుని ప్రగాఢ భారతీయతను విశ్లేషిస్తూ నిరాలా ఇలా అంటాడు-ఆయన తన బాహ్య ఆంతరికమైన ఆలోచనలకు కల్పనాత్మక అభివ్యక్తిని ఇవ్వడంలో అద్వితీయుడు అని. ఈ కళలో తులసీదాసుకు కూడా ఎవరూ సాటిరారు అని అంటాడు. భేదమేమిటంటే తులసీదాసు ప్రాచీన భారతీయ సాంస్కృతిక ధారకు అనుగుణంగా కథాసన్నివేశ చిత్రణను, నియంత్రించాల్సి వస్తుంది. కాని రవీంద్రుడు ఆధునిక యుగానుగుణంగా దేశ దేశాంతరాలలో ప్రాచుర్యంలో వున్న సౌందర్య వికాస కళను వుపయోగించుకుంటాడు. నిరాలా హిందీలో ఆధునికతా ప్రవక్త అయిన భారతేందు విప్లవ దృష్టి ప్రాముఖ్యాన్ని అంగీకరిస్తాడు. తన సమకాలీనుడు జయశంకర్ ప్రసాద్ రచన 'కామాయని' లోని ఆలోచనాత్మక మనోవైజ్ఞానిక పునాదిని సహానుభూతితో అర్థం చేసుకొనే ప్రయత్నం చేస్తాడు. నిరాలా సాహిత్యం యొక్క సాంస్కృతిక భూమికను అర్థం చేసుకొవాలంటే-ఆయన బెంగాల్ సాంస్కృతిక జాగృతి ప్రభావాన్ని గ్రహించి తన గ్రామీణ జీవితం నుండి, తన జానపద సంస్కృతి నుండి జీవనసారాన్ని పిండుకున్నాడనే వాస్తవాన్ని గుర్తు చేసుకోవాల్సి వుంటుంది. అందుకే నిరాలాకు ప్రేమ్‌చంద్ తన స్వభావ సంస్కారానికి దగ్గర అన్పిస్తాడు.

సంస్కృతితో ఎడ తెగని ఘర్షణ నిరాలా ఉత్తేజకర బహుముఖ నిర్మాణాత్మక సాహితీ శక్తికి అవసరమైన ప్రాతిపాదిక అని చెప్పవచ్చు. భారతీయ సాహిత్యంలో ఆధునికత, భారతీయుతల సంశ్లిష్ట రూపం చూడాలంటే నిరాలా సాహిత్యాన్ని తప్పకుండా ఆధారం చేసుకోవాల్సి వుంటుంది. సంస్కృతి పట్ల నిరాలాకు గల ఆసక్తి, భారతజాతి చేసే విముక్తి ప్రయత్నాలతో అనివార్యంగా ముడి పడి వుంది. ఈ ఆసక్తి కేవలం ఆతని సాహిత్యంలో మాత్రమే కేంద్రీకృతమై లేదు. అది సాహిత్య స్వధర్మం, దాని అనేక రూపాలు, కళ, వ్యాకరణాలలో నిరంతరం వ్యక్తమవుతూ వచ్చింది. బృహత్తర సామాజిక, సాంస్కృతిక వాస్తవకతతో తలపడుతూ నిరాలా తన రచనా పటిమను సునిశిత పరుస్తూ, విస్తృతం చేసుకొంటాడు. చరిత్ర సంస్కృతుల బహుముఖ భూమికపై నిరాలా కృతులతో సాంగత్యం పెంచుకోవడం, లేక దానితో తల పడటం ఒక సజీవమైన, ఒక ఉత్తేజకరమైన అనుభూతి.

# నిరాలా రచనలు

**కావ్య సంకలనాలు :**

| | | |
|---|---|---|
| అనామిక (మొదటి భాగం) | : | బాలకృష్ణ ప్రెస్, 23, శంకర్ ఘోష్ లేన్, కలకత్తా, 1923 |
| పరిమళ్ | : | గంగా పుస్తక్ మాలా కార్యాలయ్, లక్నో, 1929 |
| గీతికా | : | భారత్‌భండార్, లీడర్ ప్రెస్, ఇలాహాబాద్, 1936 |
| అనామికా (రెండవ భాగం) | : | భారత్‌భండార్, లీడర్ ప్రెస్, ఇలాహాబాద్, 1939 |
| తులసీదాస్ | : | భారత్‌భండార్, లీడర్ ప్రెస్, ఇలాహాబాద్, 1942 |
| అణిమా | : | యుగ్‌మందిర్, ఉన్నావ్, 1943 |
| కుకుర్‌ముత్తా | : | యుగ్‌మందిర్, ఉన్నావ్, 1942 |
| బేలా | : | హిందూస్తాన్ పబ్లికేషన్స్, ఇలాహాబాద్, 1946 |
| నయేపత్తే | : | హిందూస్తాన్ పబ్లికేషన్స్, ఇలాహాబాద్, 1946 |
| అర్చనా | : | కళామందిర్, ప్రయాగ్, 1950 |
| అరాధన | : | సాహిత్యకార్ సంసద్, ప్రయాగ్, 1953 |
| గీత్‌గుంజ్ | : | హిందీ ప్రచారక్ పుస్తక్ ఆలయ్, బనారస్, 1954 |
| సాంధ్య కీ కలీ | : | వసుమతీ, 38, జీరో రోడ్, ఇలాహాబాద్, 1969 |

**కథాసంకలనాలు :**

| | | |
|---|---|---|
| లిలీ | : | గంగా పుస్తక్ మాలా కార్యాలయ్, లక్నో 1934 |
| సఖీ | : | సరస్వతీ పుస్తక్ భండార్, లక్నో, 1935 |
| సుకుల్ కీ బీబీ | : | భారత్‌భండార్, లీడర్ ప్రెస్, ఇలాహాబాద్, 1941 |
| చతురీ చమార్ | : | కితాబ్ మహల్, ఇలాహాబాద్, 1945 |

**నవలలు :**

| | | |
|---|---|---|
| అప్సర | : | గంగా పుస్తక్ మాలా కార్యాలయ్, లక్నో, 1931 |
| అలకా | : | గంగా పుస్తక్ మాలా కార్యాలయ్, లక్నో, 1933 |
| ప్రభావతి | : | సరస్వతీ పుస్తక్ భండార్, లక్నో, 1936 |
| నిరుపమ | : | భారతీ భండార్, లీడర్ ప్రెస్, ఇలాహాబాద్, 1936 |
| కుల్లీభాట్ | : | గంగా పుస్తక్ మాలా కార్యాలయ్, లక్నో, 1939 |

బిల్లేసుర్ బక్‌రిహా : యుగ్‌మందిర్, ఉన్నావ్, 1942
చోటీ కీ పకడ్ : కితాబ్ మహల్, ఇలాహాబాద్, 1946
కాలేకార్ నామే : కల్యాణ్ సాహిత్య మందిర్, ప్రయాగ్, 1950
చమేలీ : అపూర్ణ/నిరాలా రచనావళీ-నందకిశోర్ నవల్, 1982
ఇందులేఖ · అపూర్ణ/నిరాలా రచనావళీ-నందకిశోర్ నవల్, 1982

**విమర్శనాత్మక వ్యాస సంకలనాలు :**

రవీంద్ర కవితా కానన్ . హిందీ ప్రచారక్ పుస్తకాలయ్, బనారస్, 1954
ప్రబంధ్ పద్మ : గంగా పుస్తక్ మాలా కార్యాలయ్, లక్నో, 1934
ప్రబంధ్ ప్రతిమా · భారత్ భండార్, ప్రయాగ్, 1940
బాబుల్ : కళామందిర్, ఇలాహాబాద్, 1942
చయన్ : కల్యాణదాస్ అండ్ బ్రదర్స్, జ్ఞాన్‌వాపీ, వారాణాసి, 1957
సంగ్రహ్ : నిరుపమా ప్రకాశన్, ప్రయాగ్, 1963

**బాల సాహిత్యం :**

భక్తధ్రువ : ద పాపులర్ ట్రేడింగ్ కంపెనీ, 115, హారిసన్ రోడ్, కలకత్తా, 1926
భక్త ప్రహ్లాద · ద పాపులర్ ట్రేడింగ్ కంపెనీ, 115, హారిసన్ రోడ్,. కలకత్తా, 1926
భీష్మ . ద పాపులర్ ట్రేడింగ్ కంపెనీ, 115, హారిసన్ రోడ్, కలకత్తా, 1926
మహారాణా ప్రతాప్ : ద పాపులర్ ట్రేడింగ్ కంపెనీ, 115, హారిసన్ రోడ్, కలకత్తా, 1927

**ఇతర రచనలు :**

రామాయణ్ కీ అంతర్ కథాయే : గంగాపుస్తక్ మహా కార్యాలయ్, లక్నో, 1956
మహాభారత్ : గంగాపుస్తక్ మహా కార్యాలయ్, లక్నో, 1939

**ఉపయుక్త గ్రంథాలు :**


| | | | |
|---|---|---|---|
| 1. | నిరాలా కీ సాహిత్య సాధనా (మూడు భాగాలు) | : | రామ్‌విలాస్ శర్మ, రాజ్‌కమల్ ప్రకాశన్, న్యూఢిల్లీ. |
| 2. | క్రాంతికార్ కవి నిరాలా | · | బచ్చన్ సింగ్, నందకిశోర్ అండ్ సన్స్, వారణాసి, 1969 |
| 3. | నిరాలా ఆత్మహంతా ఆస్థా | : | దూధ్‌నాథ్ సింగ్, నీలాభ్ ప్రకాశన్, ఇలాహాబాద్, 1972 |
| 4. | నిరాలా కీ కవితాయే | : | మూల్యాంకన్ ఔర్ మూల్యాంకన్ (సం॥) పరమానంద్ శ్రీ వాస్తవ, నీలాభ్ ప్రకాశన్, ఇలాహాబాద్, 1977 |
| 5. | నిరాలా | : | (సం॥) ఇంద్రనాధ్ మదాన్, లోక్‌భారతీ ప్రకాశన్, ఇలాహాబాద్, 1975 |
| 6. | నిరాలా కీ కవితాయే ఔర్ కావ్య భాషా | : | రేఖా ఖర్, లోక్ భారత్ ప్రకాశన్, ఇలాహాబాద్, 1976 |
| 7. | ఛాయావాద్ | | నామ్‌వర్ సింగ్, రాజకమల్ ప్రకాశన్, నయీ దిల్లీ, 1979 |
| 8. | ఛాయావాద్ కీ ప్రాసంగికతా | : | రమేష్ చంద్ర శాహ్, రాధాకృష్ణ ప్రకాశన్, దరియాగంజ్, న్యూ ఢిల్లీ |
| 9. | కవి నిరాలా | : | నందదులార్ వాజపేయీ, వాణీ విలాస్ ప్రకాశన్, వారాణాసి, 1965 |
| 10. | నిరాలా | : | కావ్య ఔర్ వ్యక్తిత్వ : ధనంజయవర్మా, విద్యా ప్రకాశన్ మందిర్, దరియాగంజ్, నయీ దిల్లీ, 1965 |